Photo by Ravinder Kumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

మనిషి చూస్తే భయం

పంపినవారు :
పిళ్లా అప్పారావు - అనకాపల్లి

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ప్రశ్నోత్తరాలు, ఫొటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు




రిజిస్టర్డు నం: 119923

# డైమండ్ సుగంధవక్క పొడి

## ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధ వక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధి చెందినదిన్నీ. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధ వక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

పొట్లం ఒకంటికి 2 న. పై. మాత్రమే.

## ది డి. పి. అండ్ కంపెని,

## కౌల్ బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - మాచెర్ల - కర్నూలు - ఆదోని - తిరుపతి
కడప - హైద్రాబాద్ - బెంగళూరు - చిత్రదుర్గం - కంబమ్.




డిస్ట్రిబ్యూటర్లు:

ఆంధ్ర: శ్రీ కృష్ణా పిక్చర్స్
సీడెడ్: ఈస్టిండియా ఫిలిం కంపెనీ
నైజాం: మహేశ్వరి పిక్చర్స్
మైసూరు: బృందావన ఫిలిమ్స్


ధైర్యశాలి
రాము
డంబాల
రంగా


చూడు ఈ బొమ్మలు ఎంత బాగా పోట్లాడుతున్నాయో! ఆ కత్తుల శబ్దాలువిను!
చాల్లే; నీవు చులాగ్గా మెచ్చుకొంటావు...


నా నటనా కౌశల్యం నీవెప్పుడూ చూడలేదు. నాటకాల్లోను, భాగోతాల్లోను నటించుటలో నేను చాలా ప్రసిద్ధి


రంగస్థలంమీద నేను అనేక ధైర్యశాలుర పాత్రలు నటించాను!


నన్ను రేపు నాటకంలో చూడు....భీముని పాత్ర ధరించుతాను.


వేషాల గదిలో

DL/P. 15A-30 TL


ఎక్కడ దాగెను
దుర్యోధనుడు..
కౌరవ పుత్రుడు


ఇదుగో వచ్చెను
భీముడు, గదా-ధారి,
వాని ప్రాణ హారి.








వహ్వా; యోధుడా! బలే యుద్ధం
చేశావులే! జ్ఞాపకముంచుకో,
డంబాలకోరు ఇట్టె అణిగిపోతాడు,
నీవు బలంగా వుండాలంటే రోజూ
పాలు త్రాగాలి మరియు 'డాల్డా'తో
వండబడిన ఆహారం భుజించాల.




डालडा




అలంకార్ పిక్చర్స్ సమర్పించు, జూపిటర్ ఎ.వి.యమ్.యస్. వారి

# స్త్రీ శపథం

అంజలీదేవి, రాజసులోచన, యమ్.యన్.రాజం, సంధ్య, కమలాలక్ష్మన్

నంబియార్.. తంగవేలు.. రామస్వామి.. జావర్ సీతారాం

పాటలు-మాటలు: అనిసెట్టి మ్యూజిక్: పామర్తి

దర్శకత్వం రఘునాథ్





నిర్మాతలు: యు. విశ్వేశ్వరరావు & బి. యన్. స్వామి








Cotswol
SOLD HERE





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మనం వన్య మృగాలను సర్కసులలోనూ, జంతు ప్రదర్శనశాలలలోనూ చూస్తాం. కాని వాటిని గురించి మనకేమీ తెలియదు. జిమ్ గ్రేఫే అనే ఆయన "వన్య మృగాలు-వాటి రహస్యాలు" అనే గ్రంథం రచించారు. దానిని ప్రచురించిన ఫ్రెడరిక్ ములర్ లిమిటెడ్ వారి అనుమతితో ఆ గ్రంథాన్ని "చందమామ"లో ఈ నెల నుంచీ "ప్రాణాలతో చెలగాటం" అన్న శీర్షిక కింద సీరియల్‌గా ప్రచురిస్తున్నాం.

కిందటి నెల "ప్రాచీన ప్రపంచాద్భుతాలు" చూసి కొందరు పాఠకులు తాజ్‌మహల్‌ను అందులో చేర్చలేదేమని అడిగారు. తాజ్‌మహల్ నవీన ప్రపంచాద్భుతాలలో మాత్రమే జమ అవుతుంది. ఈ సంచికలో "తాజ్‌మహల్" గురించి చదవండి.

ఈ సంచికతో "కంచుకోట" ముగిసింది. కొత్త సీరియల్ గురించి 70 పేజీ చూడండి.

సంపుటి 25 : డిసెంబర్ 1959 : సంచిక 6





CHITRA




రెండవ రోజు యుద్ధంలో ఉదయం భీముడు విజృంభించితే, మధ్యాన్నం దాటినాక అర్జునుడు విజృంభించాడు. అది ఈవిధంగా జరిగింది—

తమ సైన్యానికి కలిగిన నష్టం చూసి మండిపడి కౌరవ వీరులలో అశ్వత్థామా, కృపుడూ, శల్యుడూ ఏకమై ధృష్టద్యుమ్నుడిపైకి వెళ్ళారు. ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామ రథపు గుర్రాలను చంపాడు. అశ్వత్థామ వెంటనే శల్యుడి రథమెక్కి మళ్ళీ కలియబడ్డాడు. ఇది చూసి మండిపడుతూ అభిమన్యుడు వచ్చి శల్య కృపాశ్వత్థామలను ముగ్గురునీ బాణాలతో కొట్టాడు.

ఇంతలో కౌరవుల పక్షంనుంచి దుర్యోధనుడి కొడుకైన లక్ష్మణుడు అభిమన్యుణ్ణి ఎదిరించాడు. ఇద్దరికీ ఘోరమైన యుద్ధం జరిగింది. ఈ అవకాశం చూసి కౌరవ యోధులు అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు. అభిమన్యుడు ధైర్యంగా వారందరితోనూ పోరాడే సమయంలో అర్జునుడు మూడో కన్ను తెరిచిన శివుడులాగా అక్కడికి వచ్చిపడి కౌరవ సేనలను తన బాణాలతో ఊచకోత కోయసాగాడు.

కార్చిచ్చుకు అరణ్య వృక్షాలు ఆహుతి అయినట్టుగా రథ గజ తురగ పదాతి సేనలు అర్జునుడికి బలి కాసాగాయి.

ఆ సమయంలో అర్జునుడి తీవ్రత చూసి కౌరవసేనలో గల మహాయోధులు ప్రతి ఒక్కరూ భయపడినట్టు కనిపించారు. ఎందుకంటే అతని ధాటిని నిరోధించటానికి ఒక్కడూ ముందుకు రాలేదు. కౌరవ సేనలు చెల్లాచెదరై పారిపోసాగాయి. కృష్ణార్జునులు శంఖాలు పూరించారు.

భీష్ముడు తమ సేనలు పారిపోతూండటం చూసికూడా ఏమీ చేయక ద్రోణుడితో, "ఆచార్యా, అర్జునుడు ఇప్పుడు సమగ్ర

అట్టమీది బొమ్మ

శక్తితో యుద్ధంచేస్తున్నాడు. ఇటువంటి తరుణంలో ఇతణ్ణి ఎవరూ ఎదిరించలేరు. మన సైన్యాలను వెనక్కు తిప్పటంకూడా సాధ్యంగా కనబడదు. ఇంక కొంచెంసేపటికి సూర్యుడు అస్తమించనున్నాడు గనక ఈ రోజుకు యుద్ధం కట్టిపెట్టటమే మేలనుకుంటాను. బెదిరిన సేనలు యుద్ధం చెయ్యలేవు," అన్నాడు.

మర్నాడు తెల్లవారగానే మూడవ రోజు యుద్ధం ఆరంభమయింది. కౌరవసైన్యాలు గరుడ వ్యూహంలోనూ, పాండవ సైన్యాలు అర్ధచంద్ర వ్యూహంలోనూ యుద్ధానికి ఆయత్తమయాయి.

ఈనాటి యుద్ధం దొమ్మి యుద్ధంగా ప్రారంభమయింది. పాండవుల పక్షాన అర్జునుడూ, భీముడూ, ఘటోత్కచుడూ, సాత్యకీ, చేకితానుడూ, ఉపపాండవులూ విజృంభించి యుద్ధం చేయసాగారు. ఘటోత్కచుడు భీముడికన్నకూడా దారుణంగా పోరాడాడు.

దుర్యోధనుడు వెయ్యి రథాలను వెంటబెట్టుకుని ఘటోత్కచుడితో యుద్ధానికి వచ్చాడు. భీముడూ, ఘటోత్కచుడూ అతనితో తలపడ్డారు. భీముడు ఒక క్రూరమైన బాణం ఎక్కుపెట్టి దుర్యోధనుణ్ణి ఎదురు రొమ్ములలో కొట్టాడు. ఆ దెబ్బకు దుర్యోధనుడు మూర్ఛపోగా, అతని సారథి రథాన్ని



వెనక్కు తిప్పుకుని వెళ్ళిపోయాడు. ఇది చూసి కౌరవసేనలు పారిపోసాగాయి. భీముడు ఆ సైన్యాలను తరుముతూ బాణాలతో కొట్టసాగాడు.

ఇంకొక పక్క అర్జునుడూ, అభిమన్యు సాత్యకులూ కౌరవసేనలను చెదరగొట్టసాగారు. అతికష్టంమీద భీష్మద్రోణులు తమ సేనలను వెనక్కు తిప్పనారంభించారు.

ఇంతలో మూర్ఛ తెలిసి రణరంగానికి వచ్చిన దుర్యోధనుడు పారిపోతూ తనకు ఎదురైనవారిని యుద్ధోన్ముఖులను చేశాడు.

అతను నేరుగా భీష్ముడివద్దకు వెళ్ళి, "తాతా, నీవు జీవించిఉండగానే మన సైన్యం పరారీ కావటం ఎంత అవమానకరం! పాండవులలో నిన్నూ, ద్రోణ కృపాశ్వత్థామలనూ ఎదిరించగలవాళ్ళు లేరనుకుంటూ వచ్చాను. లేక, పాండవులమీద గల ప్రేమకొద్దీ నీ సైన్యమంతా నాశనమవుతూన్నప్పటికీ చూస్తూ ఊరుకుంటున్నావా? అలా అయినట్టయితే యుద్ధానికి ముందుగానే నాకీ సంగతి చెబితే బాగుండేదిగద! నీవూ, ద్రోణుడూ నన్ను నడిసముద్రంలో ముంచ దలచనివారే అయితే మీ పరాక్రమాలు కనపడేలాగా యుద్ధం చెయ్యండి!" అన్నాడు.

ఈ మాటలకు భీష్ముడు రోషం చెంది, "ఏమోయ్, పాండవులను జయించటం దేవ



తలకు కూడా సాధ్యంకాదని నీకు అదివరలో నేను చెప్పలేదా? నేను ముసలివాణ్ణి, అయినా నాకున్న శక్తి ఏమిటో చూపిస్తాను; నీవూ, నీవారూ చూడండి!" అన్నాడు. ఈ మాటలతో తృప్తిచెంది దుర్యోధనుడు శంఖం పూరించాడు, భేరులు మోగాయి.

మధ్యాన్నం దాటగానే భీష్ముడు తన ప్రతాపాగ్నికి పాండవసేనలను గురిచేయ నారంభించాడు. దుర్యోధనుడు భీష్ముడికి అండగా బలమైన సైన్యాన్ని ఏర్పాటు చేశాడు. ఆపూట భీష్ముడు చేసిన సంహారం వర్ణనాతీతం. పాండవ సేనలూ, అందు గల యోధులూ చెల్లాచెదరై పారిపోసాగారు. యుద్ధరంగంలో ఎక్కడ చూసినా హాహాకారాలు మిన్ను ముట్టాయి.

కృష్ణుడు అర్జునుడి రథాన్ని ఒకచోట ఆపి, "అర్జునా, భీష్మ ద్రోణులతో సహా సమస్త కౌరవ సేననూ నిర్మూలిస్తానని ఒకప్పుడు ప్రగల్భాలు పలికావు. అది చేసి చూపించవలసిన సమయం వచ్చింది. సింహం మృగాలను తరిమినట్టు భీష్ముడు నీ సేనలను ఎలా తరుముతున్నాడో చూడు. ఆడితప్పనివాడివైతే భీష్ముణ్ణి ప్రతిఘటించి నిర్మూలించు," అన్నాడు.

"రథాన్ని భీష్ముడికి అభిముఖంగా తోలు!" అన్నాడు అర్జునుడు.



త్వరలోనే భీష్మార్జునులు ఒకరితో ఒకరు తలపడ్డారు. ఇది చూసి పాండవ సేనలకు ధైర్యం వచ్చి వెనక్కు మరలాయి.

భీష్ముడు చాలా రౌద్రంగా ఉన్నాడు. తనపైకి వచ్చే అర్జునుణ్ణి ఆయన బాణ వర్షంలో ముంచేశాడు. కాని అర్జునుడు వరసగా రెండుసార్లు భీష్ముడి చేతిలోని విల్లును తన బాణాలతో విరగగొట్టాడు. "అర్జునా, నీకు తగినట్టుగా యుద్ధం చేస్తున్నావు! అలాగే యుద్ధం చెయ్యి!" అంటూ భీష్ముడు మరింత తీవ్రంగా యుద్ధంచేస్తూ, సారథి అయిన కృష్ణుణ్ణికూడా వాడి అయిన బాణాలతో కొట్టాడు.

భీష్ముడు తన ప్రతాపం యావత్తూ చూపుతూంటే అర్జునుడు ఏమాత్రమూ విజృంభించక మందకొడిగా యుద్ధంచేస్తున్నట్టు కృష్ణుడికి తోచింది. "ఇలా అయితే ధర్మరాజుకు సేన అంటూ మిగలదు. భీష్ముడిపై గల గౌరవంమూలాన భీష్ముణ్ణి చంపే బాధ్యత తనపై ఉన్నదని అర్జునుడు మరిచిపోతున్నాడు. ఈ భీష్ముణ్ణి నేనే చంపేస్తాను!" అనుకున్నాడు కృష్ణుడు.

ఈ లోపుగా కౌరవయోధులు విజృంభించి పాండవసేనను లేళ్ళను వేటాడినట్టు వేటాడటం కృష్ణుడి కంటపడింది. సాత్యకి వాళ్ళను కేకవేసి, "సైనికులారా! యోధు



లారా! పారిపోకండి! ఇది క్షత్రియధర్మం కాదు!" అని హెచ్చరించుతున్నాడు.

కృష్ణుడికి మండిపోయింది. అతను సాత్యకితో, "బెదరిపోయేవారిని పోనీ! ఈ మిగిలినవాళ్లంతా పోయినా పోనీ! నేను ఒక్కణ్ణే నా పరాక్రమంతో భీష్మ ద్రోణు లందరినీ చంపి, ధర్మరాజును గెలిపించి, ఆయనకు రాజ్యాభిషేకం చేసి తృప్తిచెందు తాను!" అన్నాడు.

ఈ మాట అంటూ కృష్ణుడు చేతిలో ఉన్న పగ్గాలు వదిలేసి, సుదర్శనమనే తన చక్రాయుధాన్ని తీసుకుని, రథంపైనుంచి కిందికి దూకి, భీష్ముడి రథంకేసి పోసాగాడు.

భీష్ముడు కొంచెంకూడా చలించక, "కృష్ణా, నన్ను చంపెయ్యి. నీచేత చస్తే నాకు ఇహమూ, పరమూకూడా ఉంటుంది. ఇదే నీవు నాకు చూపిన గౌరవం అనుకుం టాను!" అన్నాడు.

కృష్ణుడు కోపోద్రేకంతో, "ఓ ముసలి వాడా, ఈ ప్రజాక్షయానికి అసలు కారణం నీవే. ఇవాళ దుర్యోధనుణ్ణి ఉద్ధరించటానికి బయలుదేరి వచ్చావు, కాని ఆనాడు మీ రాజు కపట ద్యూతంలో పాండవులను ఓడించినప్పుడు అతడి మంత్రివై ఉండి ధర్మం ఎందుకు బోధించకపోయావు? ఒక వేళ అతడు ఆనాడు నీమాట వినకపోతే



అతణ్ణి అప్పుడే ఎందుకు విడిచిపుచ్చ లేదు?" అన్నాడు.

"రాజు ఆశ్రితులకు పరదైవం గదా?" అన్నాడు భీష్ముడు.

"యాదవుల హితం వినని కంసరాజు గతి ఏమయింది? విపరీతబుద్ధి అయిన రాజు శిక్ష పొందటం ధర్మం కాదా?" అని కృష్ణుడు మళ్లీ అడిగాడు.

ఈలోపుగా అర్జునుడు రథం దిగి వచ్చి కృష్ణుణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. కాని క్రోధావేశంలో ఉన్న కృష్ణుడు అర్జునుణ్ణి పది అంగల దూరం లాక్కుపోయాడు. అప్పటికి అర్జునుడు కృష్ణుణ్ణి నిలవేసి, "దేవా, శాంతించు. పాండవులకు నీకన్న వేరే గతి ఎవరు? నా అన్నదమ్ములపైనా, పిల్లలపైనా ప్రమాణం చేసి చెబుతున్నాను, నేను నా ప్రతిజ్ఞ నిలబెట్టుకుంటాను. భీష్మ ద్రోణులతోపాటు, కౌరవ వంశాన్నికూడా నిర్మూలించి తీరుతాను!" అన్నాడు.

అప్పటికి కృష్ణుడు శాంతించి తిరిగి రథం వద్దకు వెళ్లి తన స్థానంలో కూచున్నాడు. ఆ తరవాత అర్జునుడు విజృంభించి యుద్ధం చేశాడు. ఆ పూట అతను కౌరవ యోధులందరితోనూ పోరాడటమే గాక, ఈ యుద్ధంలో మొట్టమొదటిసారిగా ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. దాని ప్రభావంచేత కౌరవ సైన్యాలు నల్లులు మాడినట్టు మాడిపోయాయి. భీష్మ ద్రోణులకే ప్రళయం ముంచుకువచ్చినట్టు తోచించి. కౌరవ యోధులు చేసేదిలేక యుద్ధరంగం విడిచి వెళ్లిపోయారు. ఆ పూట అర్జునుడు కౌరవ సైన్యంలో పదివేల రథాలూ, ఏడువందల ఏనుగులూ, పూర్తిగా సౌవీరగణాన్నీ, క్షుద్రక మాలవులనూ నిర్మూలించేశాడు. కౌరవ సైనికులు సయితం దివిటీల సహాయంతో తమతమ శిబిరాలకు వెళ్లిపోతూ అర్జునుడు చేసిన ప్రళయమైన యుద్ధాన్ని గురించే మాట్లాడుకున్నారు.






## 18

[శివపురం పొలిమేరల్లో చంద్రవర్మా, సేనాని ధీరమల్లుడూ కలిసి తమ సైన్యాలతో, సర్పకేతుణ్ణి ఒకానొక కొండ కనుమలో ఎదుర్కొన్నారు. సర్పకేతుడి సైనికుల్లో చాలామంది చంద్రవర్మ పక్షానికి వచ్చారు. సర్పకేతుడు మిగిలిన సైన్యంతో పారిపోసాగాడు. చంద్రవర్మ అతడి వెంట కొందరు భటులను పంపాడు. తరవాత—]

సూర్యుడు పడమటి దిక్కుకు బాగా వాలిపోయిన తరవాత, చంద్రవర్మ పంపిన భటుల్లో యిద్దరు తిరిగివచ్చి, సర్పకేతుడి సైన్యం కనబడలేదనీ, కాని, కాలి గుర్తులను బట్టి వాళ్ళు పడమటి దిశకేసి పోతున్నట్టు తెలిసిందనీ వర్తమానం తెచ్చారు.

ఈ వార్త వింటూనే చంద్రవర్మ, ధీరమల్లుకేసి తిరిగి, "ధీరమల్లూ! సర్పకేతుడు మాహిష్మతీ నగరంకేసి పారిపోవటంలేదనీ, అతడు సరాసరి కంచుకోటవైపుకు ప్రయాణం కట్టాడనీ నా అభిప్రాయం," అన్నాడు. సేనాని ధీరమల్లుడూ, సుబాహుడూ కూడా చంద్రవర్మతో ఏకీభవించారు. అయితే యిప్పుడు తాము మాహిష్మతీనగరంకేసి వెళ్ళటమా? లేక సర్పకేతుణ్ణి అనుసరించి కంచుకోటకు వెళ్ళటమా అన్న సమస్య వచ్చింది. కొద్దిసేపు ఆలోచించిన మీదట కంచుకోటకు వెళ్ళి, అక్కడ సర్పకేతుణ్ణి హతమార్చటమే ఉత్తమమార్గమని వాళ్ళు నిర్ణయించుకున్నారు.



వెంటనే సైనికులందరూ పడమటిదిశగా ప్రయాణానికి సన్నద్ధం చేయబడ్డారు. కొద్ది సేపట్లో సైన్యమంతా కదిలింది. వాళ్లు సర్పకేతుడి సైన్యం నడిచిన గుర్తుల ఆధారంతో కొండల్లోనుంచి బయటపడి కొంతదూరం అడవిమార్గాన ప్రయాణించి, ఒక పెద్ద నది ఒడ్డుకు చేరారు. ఆ నదిని చూస్తూనే చంద్రవర్మ నివ్వెరపోయాడు. ఇంత పెద్ద సైన్యాన్ని నది దాటించటం ఎట్లా? సర్పకేతుడు నదిని ఎలా దాటగలిగాడు?

చంద్రవర్మ యిలా మథనపడుతున్నంతలో, దాపుల నున్న ఒక మహావృక్షం కొమ్మలనుంచి పెద్దగా బుసలుకొడుతూ



మూడు తలల మహాసర్పం ఒకటి దభీమంటూ భూమిమీద పడింది. అందరూ భయాశ్చర్యాలతో దానికేసి చూస్తున్నంతలో, ఆ సర్పం మానవరూపం పొంది, "చంద్రవర్మా!" అంటూ ఎలుగెత్తి కేకపెట్టి, అతడికేసి పరిగెత్తుతూ వచ్చింది.

తనను పేరున పిలుస్తూ, సమీపానికి వస్తున్న ఆకారాన్ని చూస్తూనే చంద్రవర్మ ఒక్క గెంతున ముందుకు వెళ్ళి, "కాలకేతూ? నీవా!" అంటూ అతడి చేయి పట్టుకున్నాడు.

"అవును, వర్మా! నీ దయవల్ల కాలకేతుడుగా మారిన, మంత్రగత్తె కాపాలిని సేవకుడు కాలనాగును నేనే! నీ శత్రువు సర్పకేతుడు యింతకుముందే తన సైన్యంతో నదిని దాటి పోయాడు. అతడు నది దాటేందుకు ఉపయోగించిన తెప్పకొయ్యలనూ, దూలాలనూ అద్దరినుంచి యిద్దరికి చేర్చి ఆదుగో, ఆ కనబడే చెట్లచాటున వున్న నది పాయలో భద్రపరిచాను," అన్నాడు కాలకేతుడు. తరవాత అతడు చంద్రవర్మ చేయి పట్టుకుని అతణ్ణి అల్లంత దూరంలో వున్న చెట్లచాటుకు తీసుకుపోయి, "చంద్రవర్మా! నేను నీకు సహాయం చేయాలన్న వుద్దేశంతో శంఖుడి కొండనుంచి హుటా



హుటిగా యిక్కడికి వచ్చాను. చాలారోజుల క్రితమే కాపాలిని చనిపోయింది చనిపోయే ముందు ఆమె భూత వర్తమానాలను చూపే గాజుగోళాన్నీ, మానవాస్థికనూ నాకు యిచ్చి పోయింది. వాటివల్లనే నీవు ఎలాంటి కష్టాల్లో వున్నావో నేను గ్రహించగలిగాను. ప్రస్తుతం నీ శత్రువూ.... ఆ కారణంగా నా శత్రువూ కూడా అయిన సర్పకేతుడు తన సైన్యాలతో ఎక్కడ వున్నాడో మూద్దామా?' అంటూ కాల కేతుడు చెట్టుచాటునుంచి గాజుగోళాన్ని బయటికి తీసి, మంత్రం జపిస్తూ దాన్ని మానవాస్థికతో తాకాడు. మరుక్షణంలో వాళ్ళకు ఓ అద్భుత దృశ్యం కంటబడింది.

సూర్యకాంతిలో కంచుకోట గోడలు తళ తళ మెరుస్తున్నవి. కోట గోడల్లో ఉత్తర దిశగా వున్న ముఖద్వారపు పెద్ద కంచు తలుపులు బార్లా తెరవబడి వున్నవి. వాటి ముందు కొద్దిమంది సైనికులు కాపలా వున్నారు. కోటలోపల శిథిల స్థితిలో వున్న అనేక భవనాలలో సర్పకేతుడి సైనికులు విచ్చలవిడిగా సంచరిస్తూ, వెలలేని రత్నాలనూ, బంగారాన్నీ కొల్లగొడుతున్నారు.

"చంద్రవర్మా! ఇవీ మన శత్రువుల గుట్టుమట్లు చాలామంది అనుకుంటున్నట్టు కంచుకోట గోడలను సముద్రజలం తాకటం



లేదు. దాదాపు నూరు సంవత్సరాలక్రితం సముద్రం పొంగి కంచుకోటను జలమయం చేసి, క్రమంగా కోటగోడలను విడిచి దాదాపు ఒక కోసెడుదూరం వెనక్కుపోయింది," అన్నాడు కాలకేతుడు.

కాలకేతుడు యిలా చెప్పగానే, చంద్ర వర్మ ఎంతో ఉత్సాహంతో తన సైనికులను నది దాటేందుకు ఆయత్తపరిచాడు. కాల కేతుడు జాగ్రత్తపరిచిన తెప్పకొయ్యలూ, పెద్దపెద్ద దుంగలూ వుపయోగించి, సైనికులు నది దాటారు.

కాలకేతుడు ఒక గుర్రం ఎక్కి ముందుండి దారి చూపుతూండగా సైన్యం



యావత్తూ శరవేగంతో కంచుకోటకేసి పోసా గింది. ఒక గంట తరవాత వాళ్ళకు ఆకాశా న్నంటుతున్నవా అన్నట్టున్న కంచుకోట గోడలు కనిపించినై. వాళ్ళు క్రమంగా కోటను సమీపించి ఉత్తరపు వైపున వున్న కోట ద్వారాలకేసి వెళ్ళేసరికి, ద్వారాలు బంధింప బడి వున్నవి. చంద్రవర్మ సుబాహుణ్ణీ, సేనాని ధీరమల్లుణ్ణీ వెంటపెట్టుకుని ద్వారా లను సమీపించి, వాటిని పరీక్షించి చూశాడు. అవి దృఢమైన కంచుతో చేయబడి వున్నవి. ఇంత బలమైన కంచు తలుపులను బద్దలు కొట్టి, కోటలో ఎలా ప్రవేశించటమా? అని చంద్రవర్మ ఆలోచించేంతలో, కోట గోడల మీద సర్పకేతుడు బిగ్గరగా అరవటం వినబ డింది. అతడివెంట పెద్ద తట్టలూ, బుట్టలూ, గోతాలూ పట్టుకుని వున్న కొందరు సైనికులు కనిపించారు.

సర్పకేతుడు తన పక్కన నిలబడివున్న సైనికులను, గోడలకింద వున్న చంద్రవర్మ సైనికులకు చూపుతూ, "ఇదిగో, నా సైనికుల దగ్గిర వున్న గోతాలూ, బుట్టలూ చూశారా? వాటినిండా రత్నాలూ, బంగారం వున్నది. చంద్రవర్మను వదిలి నా పక్షానికి వచ్చే ప్రతి సైనికుడికీ అన్ని రత్నాలూ, బంగారం యిస్తాను. అలా నా పక్షానికి వచ్చేవారికోసం కోట తలుపులు తెరవబడతవి. ఈ గోతాల్లో





వున్నది బంగార మవునో కాదో మీరే చూడండి!" అన్నాడు.

సర్పకేతుడు అలా అనగానే, అతడి వెంట వున్న సైనికులు బుట్టలనుంచీ, గోతాల నుంచీ వెండి బంగారాలనూ, రత్నాలనూ చంద్రవర్మ సైనికులపై బడేలా కుమ్మరించారు. చంద్రవర్మ సైనికులు వాటికోసం కొట్లాడుతూ, ఒకరినొకరు కుమ్ముకో సాగారు. పరిస్థితి ప్రమాదకరంగా పరిణమిస్తున్నదని గ్రహించిన చంద్రవర్మ, సుబాహుడితో, "సుబాహూ! నువ్వు మన వీరపుర సైనికులను వెంటబెట్టుకుని, శత్రు పక్షంలో చేరేవాడిలా నటిస్తూ కోటతలుపులు తెరవమని కేకలుపెట్టు. అది నమ్మి సర్పకేతుడు తలుపులు తెరిపించేట్టయితే, వెంటనే కోటలో జొరబడు. నేనూ, ధీరమల్లుడూ మిగిలిన సైన్యంతో వస్తాం. అప్పుడు ఒక్కమ్మడిగా అందరం శత్రువుల మీద పడి వాళ్ళను సర్వనాశనం చేద్దాం," అన్నాడు.

చంద్రవర్మ యిలా చెప్పగానే సుబాహుడు సైనికుల దగ్గిరకు వెళ్ళి, వాళ్ళతో రహస్యంగా మాట్లాడాడు. చూస్తూండగానే సైన్యంలోనుంచి ఒక పెద్ద భాగం వేరుపడి, "సర్పకేత మహారాజుకూ, జై!" అంటూ కోటతలుపులకేసి కదిలింది. వాళ్ళు ముందుకు పోకుండా అటకాయించేవాళ్లలా





కొందరు సైనికులు, వాళ్ళతో పృత్తుత్తి యుద్ధం ప్రారంభించారు.

చంద్రవర్మ సైన్యంలో తిరుగుబాటు వచ్చిందని నమ్మిన సర్పకేతుడు కోటగోడల మీదినుంచి వికటాట్టహాసం చేస్తూ, "కోట తలుపులు తెరవండి! శత్రుసైన్యంలో ఎక్కువభాగం మన పక్షమైంది. చంద్రవర్మనూ, వాడి ముఖ్యానుచరులనూ క్షణాల మీద నా కత్తికి ఎరచేస్తాను!" అని కేకలు పెట్టాడు. ఆ వెంటనే సర్పకేతుడి సైనికులు కోట తలుపులను తెరిచారు.

ఆ తరవాత కన్నుమూసి తెరిచేంతలో జరిగిపోయిందా, అన్నంత ఆశ్చర్యకరంగా



సర్పకేతుడి సైన్యం తుడిచిపెట్టబడింది. సైనికులతో కోటలో ప్రవేశిస్తూనే సుబాహుడు ఎదురైన శత్రుసైనికులను తన కత్తితో నరకసాగాడు. అంతలో చంద్రవర్మ, ధీరమల్లుడూకూడా కంచుకోటలో ప్రవేశించారు. వారి ధాటికి సర్పకేతుడి సైన్యం చెల్లాచెదురుగా పారిపోసాగింది.

జరిగిన మోసం చూసి సర్పకేతుడు నిలువెల్లా భగ్గుమన్నాడు. అతడు కోట గోడల మీద తన వెంటవున్న కొద్దిమంది సైనికులను హెచ్చరించి, అక్కడ వున్న పెద్దపెద్ద బండరాళ్ళను ఎత్తి, దిగువ నున్న చంద్రవర్మ సైనికులమీదికి విసరసాగాడు. అది చూసిన చంద్రవర్మ, సుబాహుడితో "సుబాహూ! ఆ దుష్టుణ్ణి సాధ్యమైతే ప్రాణాలతో పట్టుకో. అలా సాధ్యంకాని పరిస్థితుల్లో నీ కత్తితో తునాతునియలుగా నరుకు!" అని కేకపెట్టాడు.

సుబాహుడు కొందరు సైనికులను వెంటపెట్టుకుని కూలిపోయిన కోటగోడ రాళ్ళ మీదుగా పాకి, గోడ పైభాగానికి వెళ్ళాడు. కాని, సర్పకేతుణ్ణి పట్టుకోవటం సాధ్యమయేలా అతడికి కనిపించలేదు. తనకు ఎలానూ చావు తప్పదని నిశ్చయించుకున్న సర్పకేతుడు రాక్షసుడిలా బొబ్బలుపెడుతూ,








ఎదురైన సైనికులను తన కత్తితో ఊచకోత కోస్తున్నాడు. కోటగోడలమీద సుడిగాలిలా యిటునుంచి అటు పరుగెత్తుతూ అతడు చేసే భీభత్సాన్ని చూసి చంద్రవర్మ సైనికులు వణికిపోయారు.

"చంద్రవర్మా! సర్పకేతుడికి సరి అయిన ప్రతియోధుణ్ణి నేను! వాడు కోట గోడలమీడినుంచి, పెను శిలలా కింద పడబోతున్నాడు. ప్రాణాలతో వాణ్ణి బంధించదలిస్తే, వాడు భూమిని తాకి ముక్కలు కాకముందే జాగ్రత్తపడి పట్టుకో!" అంటూ కాలకేతుడు కత్తిదూసి ఒక్క ఎగురున కోట గోడలమీదికి వెళ్ళాడు.

కాలకేతుణ్ణి చూస్తూనే, సర్పకేతుడు పెద్దగా రంకె వేసి అతడిమీదికి దూకాడు. కాలకేతుడు అతడి కత్తిదెబ్బను తప్పుకుని, తన కత్తిని ముందుకు సాచి అతడిమీదికి లంఘిస్తూ, "సర్పకేతూ! నువ్విప్పుడు పోరాడుతున్నది కాలకేతుడితో! కాలకేతుడంటే మూడుశిరస్సుల మహాకాలసర్పం!" అంటూ చటుక్కున సర్పాకృతి దాల్చి, బుస్సుమంటూ పైకి లేచాడు.

సర్పకేతుడు ఒక్క క్షణకాలం స్తంభించిపోయి, ఆ వెంటనే ప్రాణభీతితో కీచుమంటూ అరిచి కోటగోడలమీదినుంచి తలకిందులుగా కిందికి పడిపోయాడు. చంద్రవర్మ సమీపించేసరికే, అతడి ప్రాణం పోయింది. దానితో చావగామిగిలిన సర్పకేతుడి సైనికులు చంద్రవర్మకు లొంగిపోయారు.

* * *

కాలకేతుడు తాను కంచుకోటలో నివాసం ఏర్పరుచుకునేందుకు అనుమతి కోరగా, చంద్రవర్మ అందుకు అంగీకరించాడు. ఆ రాత్రి తన సైనికులతో అతడు కంచుకోట శిథిలాలలో కాలం గడిపి, అక్కడ దొరికిన ధనరాసులతో, తెల్లవారగానే రుద్రపురం వైపుకు ప్రయాణమయాడు. ఒకటి రెండు రోజుల ప్రయాణం తరవాత రుద్రపుర



వాసులు కొందరు చంద్రవర్మ దగ్గిరకు వచ్చి, రాజు శివసింహుడు కొండల్లోకి పారిపోయాడనీ, యిప్పుడు తమకు రాజు లేడనీ విన్నవించుకున్నారు. చంద్రవర్మ, ముసలివాడి కొడుకు దేవలుణ్ణి రుద్రపుర రాజుగా నియమించాడు.

చంద్రవర్మ మాహిష్మతీ నగరానికి కొన్ని కోసులదూరంలో వుండగానే, నగరవాసులకు క్రూరుడైన సర్పకేతుడి చావును గురించి తెలిసింది. వాళ్ళు మంగళ వాయిద్యాలతో బయలుదేరి, చంద్రవర్మకు ఎదురువచ్చి, అతణ్ణి తమకు చక్రవర్తిగా వుండవలసిందని కోరారు. కాని, చంద్రవర్మ అందుకు అంగీకరించలేదు. యశోవర్ధన చక్రవర్తి పెద్ద కుమారుడు తపోవర్ధనుడు చక్రవర్తి కావటం ఉత్తమంగా వుంటుందని అతడు వారికి తెలియపరిచాడు.

మాహిష్మతీనగర పరిసరారణ్యాల్లో ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్న తపోవర్ధనుడి దగ్గిరకు చంద్రవర్మతో పాటు నగరవాసులుకూడా వెళ్ళి, ఆయనను సింహాసనం అధిష్ఠించవలసిందిగా కోరారు. తపోవర్ధనుడు దానికి అంగీకరించక, "నేనేనాడో సర్వసంగపరిత్యాగం చేసినవాణ్ణి. నాకు రాజ్యకాంక్ష లేదు. మీ అందరి గౌరవాదరణలకూ, ప్రేమాభిమానాలకూ పాత్రుడైన చంద్రవర్మ మీకు చక్రవర్తిగా వుండటం అన్నివిధాలా మంచిదని నేను భావిస్తున్నాను," అన్నాడు.

తరవాత ప్రజల కోరికను మన్నించి తపోవర్ధనుడు స్వయంగా కిరీటాన్ని చంద్రవర్మ శిరస్సున పెట్టాడు. ప్రజలు జయజయ ధ్వానాలు చేశారు.

చంద్రవర్మ, తనకు విశ్వాసపాత్రులైన ధీరమల్లు, సుబాహులకు ముఖ్య మంత్రి పదవీ, ముఖ్య సేనాని పదవీ యిచ్చి, ప్రజానురంజకంగా ఎంతోకాలం రాజ్యపాలన చేశాడు. —(అయిపోయింది)





# లియర్ రాజు

బ్రిటనుకు రాజైన లియర్‌కు ముగ్గురు కుమార్తెలు. పెద్ద కుమార్తె గానెరిల్, అల్బనీ ప్రభువును పెళ్ళాడింది; రెండవది రీగాన్, కార్న్‌వాల్ ప్రభువును పెళ్ళాడింది. లియర్ ఆఖరు కుమార్తె అయిన కార్డీలియాకు ఇంకా పెళ్ళికాలేదు. ఆమెను పెళ్ళాడే ఉద్దేశంతో ఫ్రాన్సుదేశపు రాజూ, బర్గండీ ప్రభువూ వచ్చి లియర్ రాజు కొలువులో ఉంటున్నారు.

లియర్ ఎనభై ఏళ్లు దాటి, కాటికి కాళ్ళు చాచుకుని ఉన్న వృద్ధుడు. ఆయన రాజ్యభారాన్ని తన కుమార్తెలపై వేసి విశ్రాంతి తీసుకోదలచినవాడై, తన ముగ్గురు కుమార్తెలనూ పిలిపించి, "అమ్మాయిలూ, మీకు నాపై గల ప్రేమనుబట్టి నా రాజ్యాన్ని పంచదలిచాను. అందుచేత ఒక్కొక్కరికీ నాపైన ఎంత ప్రేమ ఉన్నదీ చెప్పండి!" అని అడిగాడు.

"నాన్నగారూ, నాకు మీపైన గల ప్రేమను వర్ణించటానికి మాటలు చాలవు. నాకు నా ప్రాణంకన్నా, స్వేచ్ఛకన్నా మీరే ఎక్కువ," అన్నది పెద్దకుమార్తె గానెరిల్. లియర్ ఈ మాటలకు పరమానందం చెంది ఆమెకూ, ఆమె భర్తకూ తన రాజ్యంలో మూడవవంతు ఇచ్చేశాడు.

తరవాత రెండవకుమార్తె రీగాన్ కూడా తన ప్రేమ తన అక్కగారి ప్రేమకంటె కూడా ఎక్కువైనదనీ, తనకు తండ్రిని ప్రేమించటంకంటె జీవితంలో మరొక సుఖంగాని, ఆనందంగాని లేదనీ బడాయిలు చెప్పింది. అలాటి కుమార్తెలుండటం తన అదృష్టమంటూ లియర్‌రాజు రీగాన్‌కు కూడా తన రాజ్యంలో మూడవవంతు ఇచ్చి, "నా కడగొట్టు కుమార్తె ఏమంటుంది?" అని కార్డీలియాను ప్రేమపూర్వకంగా అడిగాడు.

విలియం షేక్స్పియర్




"నాన్నగారూ, అనేటందుకు నాకేమీ లేదు," అన్నది కార్డీలియా.

లియర్ ఆశ్చర్యంతో, "అనేటందుకేమీ లేదా? ఏమీ అనకపోతే ఏమీ రాదు. మళ్ళీ ఆలోచించుకుని చెప్పు!" అన్నాడు.

"తండ్రిని కుమార్తె ఎలా ప్రేమించాలో నేను మిమ్మల్ని అలాగే ప్రేమిస్తున్నాను. అంతకంటె ఎక్కువా లేదు, తక్కువా లేదు," అన్నది కార్డీలియా.

లియర్ మండిపడ్డాడు. ఈ ధోరణి మార్చుకోకపోతే ఆమెకు తననుంచి ఏమీ ముట్టదని బెదిరించాడు. "నేను నిజమే చెప్పాను. మా అక్కలలాగా కల్లబొల్లి మాటలు చెప్పటం నా చేతకాదు. వారికి తండ్రిపై అంత ప్రేమ ఉన్నవాళ్ళు పెళ్ళిళ్ళు ఎందుకు చేసుకోవాలి. నేను పెళ్ళాడటమే జరిగితే నా ప్రేమనూ, శ్రద్ధాసక్తులనూ నా భర్తకు తప్పక పంచి ఇస్తాను!" అన్నది కార్డీలియా.

నిజానికి కార్డీలియా తన తండ్రిని తన అక్కలకంటె హెచ్చుగానే ప్రేమించింది. అయితే వారిలాగా రాజ్యంలో భంకొద్దీ ఇచ్చు కాల మాటలు చెప్పటం ఆమెకు నీచంగా కనిపించింది. కాని మూర్ఖుడైన లియర్ ఆ సంగతి అర్థం చేసుకోక, కోపావేశం చెంది తన రాజ్యమంతా తన ఇద్దరు కుమార్తెలకూ పంచేసి, కార్డీలియాకు ఏమీ లేకుండా చేస్తూ, "నేను నీకు తండ్రినికాను, నీవు నా కుమార్తెవు కావు," అన్నాడు. ఆయన నిండు కొలువులో తన రాజ్యాధికారాలనూ, ఆదాయాన్నీ, తన పరివారాన్నీ తన పెద్ద కుమార్తెలిద్దరికీ పంచి, తాను నామమాత్రపు రాజుననీ, తనకు వందమంది నౌకర్లు చాలుననీ, వంతు ప్రకారం నెలకొక కుమార్తె పోషణలో ఉంటాననీ ప్రకటించాడు.

రాజు ప్రవర్తన సభికులందరికీ విపరీతంగానే తోచింది, కాని వారు ఆయన కెదురు చెప్ప సాహసించలేకపోయారు. అయితే

అయన సామంతులలో ఒకడైన కెంట్ ప్రభువు సాహసించి రాజుగారిని అధిక్షేపించాడు. లియర్‌కు జ్ఞానోదయం కలగటానికి మారుగా ఆగ్రహావేశం హెచ్చిపోయింది. అయన కెంట్ ప్రభువుతో, "అయిదు రోజుల లోగా దేశం విడిచి వెళ్లిపో! ఆ తరవాత పొలిమేర లోపల కనిపిస్తే నీ ప్రాణాలు దక్కవు," అని శాసించాడు.

కెంట్ ప్రభువు వెంటనే సభనుంచి బయటికి వెళ్లిపోయాడు.

ఇప్పుడు లియర్ రాజు ఫ్రాన్సు రాజునూ, బర్గండీ ప్రభువునూ పిలిచి, "మీరింకా కార్డీలియాను పెళ్ళాడగోరుతున్నారా?" అని అడిగాడు.

బర్గండీ ప్రభువు తాను ఆ ఉద్దేశం మానుకున్నట్టు చెప్పాడు. కాని ఫ్రాన్సు దేశపు రాజుమటుకు, కార్డీలియాను తప్పక పెళ్ళాడగోరాడు. ఆమెలోని నిజాయితీ అయనను మరింతగా ఆకర్షించింది. కార్డీలియా తన అక్కలవద్ద శలవు పుచ్చుకుంటూ, "నాన్నగారిపైన మీకున్నదని చెప్పుకున్న ప్రేమను ఆచరణలో కూడా చూపించండి!" అని అన్నది. తన తండ్రి తన అక్కల చేతిలో చిక్కినందుకు విచారిస్తూ ఆమె ఫ్రాన్సురాజు వెంట వెళ్లిపోయింది.



లియర్ రాజు తాను చేసుకున్న ఏర్పాటు ప్రకారం మొదటి నెల తన పెద్ద కుమార్తె అయిన గానెరిల్ పోషణలో ఉన్నాడు. అయితే నెల తిరగకుండానే ఆమె తన అసలు స్వరూపాన్ని బయట పెట్టుకున్నది. తనకు అర్ధ రాజ్యాన్ని పంచి యిచ్చిన తండ్రిని చూసి ఆమె ముఖం చిట్లించసాగింది. ఆయన పిలిస్తే వినిపించుకునేది కాదు, ఆయన మాట్లాడుతుంటే వెళ్ళిపోయేది. ఆయనకు నూరుమంది సేవకులెందుకని విసుక్కునేది. ఆమె ప్రోత్సాహంతో నౌకర్లూ, చాకర్లూ లియర్‌ను చులకనగా కూడా చూడసాగారు. ఇదంతా గ్రహించి

కూడా లియర్ పళ్ల బిగువున సహించాడు. కపట ప్రేమ నటించిన గానెరిల్ తండ్రి పట్ల ఈ విధంగా ప్రవర్తిస్తూఉంటే, దేశ బహిష్కారం పొందిన కెంట్ ప్రభువు రాజాజ్ఞను ఉల్లంఘించి తన రాజుకు సేవ చేయ సంకల్పించాడు. ఆయన నౌకర్లు ధరించే దుస్తులు ధరించి, వేషం మార్చుకుని, మారు పేరుతో లియర్ రాజువద్ద సేవకుడుగా కుదిరి ఆయనను కనిపెట్టి ఉండసాగాడు. అతను లియర్‌తో ధూర్తంగా మాట్లాడిన వారిని జంకులేకుండా శిక్షించసాగాడు. ఇది చూసి లియర్‌కు అతనిపై చాలా అభిమానం కుదిరింది.

కెంట్ ప్రభువులాగే లియర్‌రాజును అభిమానంతో అంటిపెట్టుకుని ఉండిన మరొక మనిషి రాజ విదూషకుడు. ఈ విదూషకుడు లియర్ మూర్ఖత్వాన్ని ఒక చెంప విమర్శిస్తూనే ఆయనను తన హాస్యంతో ఆనందపరిచేవాడు.

గానెరిల్ ఈ విదూషకుడి సూటిపోటి హాస్యాలు బొత్తిగా భరించలేకపోయింది. ఆమె ఒకనాడు తన తండ్రిని మొహమాటం లేకుండా, "నీకీ స్థితిలో నూరుమంది బలగం దేనికి? వీరందరినీ మేపలేక చస్తున్నాం! నీ ఈడువారిని కొద్దిమందిని ఉంచుకుంటే నీ పరువుకు భంగమా?" అని అడిగింది.



లియర్ ఆగ్రహానికి మేరలేదు. పెద్ద కూతురు తన అర్ధ రాజ్యం కాజేసి తనపట్ల ఇలా ప్రవర్తించటం ఆయనకు విడ్డూరంగా తోచింది. ఆయన గానెరిల్‌ను రకరకాల శాపనార్థాలు పెట్టి, "నేనిక్కడ ఉండను. నా రెండో కుమార్తె అయిన రీగాన్ వద్దకు వెళ్లిపోతాను!" అంటూ బయలుదేరాడు.

నౌకరు వేషంలో ఉంటున్న కెంట్ ప్రభువు ముందుగా రీగాన్ ఇంటికి వెళ్ళి, లియర్ రాజు సపరివారంగా వస్తున్నట్టు తెలిపాడు. అయితే అప్పటికే గానెరిల్ తన చెల్లెలి వద్దకు మనిషిని పంపింది. తమ తండ్రివెంట వచ్చే బలగాని కంతకూ ఆశ్రయం ఇవ్వవద్దని చెల్లెలికి హెచ్చరిక చేయాలని ఆమె ఉద్దేశం. కెంట్ చేరే సమయానికే ఆ మనిషికూడా చేరాడు. ఆ మనిషి అదివరకు కెంట్‌చేత గానెరిల్ ఇంట అవమానం పొందినవాడే. వాడేదో మోసపు వార్త మోసుకు వస్తున్నట్టు శంకించి కెంట్ వాడితో తగాదా పెట్టుకుని వాణ్ణి చావ చితక తన్నాడు. ఈ లోపుగా రీగాన్ బయటికి వచ్చి, రాజదూతను తన్నాడన్న కారణంగా కెంట్‌ను బందీని చేయించింది.

లియర్ వస్తూనే తన నౌకరు బందీగా ఉండటం చూశాడు. ఆయన అక్కడి నౌకర్లను, "నా కూతురూ, అల్లుడూ ఎక్కడ?"





అని అడిగితే, వారు, "అయ్యా, వారు తెల్ల వార్లూ ప్రయాణంచేసి అలసిపోయి విశ్రాంతి తీసుకుంటున్నారు!" అని చెప్పారు. లియర్ కోపోద్రేకంతో తాను వారిని చూసి తీరాలని కేక పెట్టేసరికి, రీగాన్, ఆమె భర్తా బయటికి వచ్చారు. వారివెంట తన పెద్ద కుమార్తె గానెరిల్ కూడా ఉండటం చూసి లియర్ విస్తుపోయాడు. ఆయన తన పెద్ద కుమార్తెను, "నా మొహం చూడటానికి నీకు లజ్జ లేదా?" అని అడిగాడు.

రీగాన్ ఆయనకు అడ్డువచ్చి, అక్కవద్దకు తిరిగి వెళ్ళమనీ, తన పరివారంలో సగం మందిని తీసివెయ్యమనీ సలహా ఇచ్చింది.

"అలా ఎన్నటికీ జరగదు. నా వంద మంది పరివారంతో నీ దగ్గిరే ఉండిపోతాను. నీవు గానెరిల్‌లాగా దుర్మార్గురాలివి కావు!" అన్నాడు లియర్.

"నీకు యాభైమందికూడా అనవసరమే. ఇరవైఅయిదుమంది చాలు," అన్నది రీగాన్ కోపంగా.

"నీకంటె గానెరిల్‌కే రెట్టింపు ప్రేమ ఉన్నట్టున్నది. ఆమె యాభైమంది పరివారకులను ఉంచటానికి ఒప్పుకున్నది!" అన్నాడు లియర్, రీగాన్ కూడా తనకు శత్రువు లాటిదేనని తెలుసుకుని.

"పాతికమంది కాదుగదా, పదిమంది కూడా అనవసరమే. అయిదుగురుకూడా అక్కర్లేదు. నా నౌకర్లూ, నా చెల్లెలు నౌకర్లూ ఉండగా నీకు వేరే నౌకర్లెందుకు?" అని గానెరిల్ అడిగింది.

లియర్ తన కుమార్తెలిద్దరినీ కసితీరా శపించాడు. ఈలోగా చీకటి పడింది, పెద్ద తుఫాను కూడా సాగింది. పరివారం లేకుండా తన కుమార్తెల ఆశ్రయంలో ఉండేకంటె ఆ తుఫానులో పడి వెళ్లిపోవటమే మేలని ఆయనకు తోచింది. కుమార్తెల దుష్ప్రవర్తనతో ఆయన మతి చలించనారంభించింది.

అంత ముసలివాడు, తమపై అన్ని ఆశలూ పెట్టుకుని, తన రాజ్యాన్ని పంచి ఇచ్చిన తండ్రి పరివారంతో సహా చీకటిలో పడి తుఫానులోకి వెళ్లిపోతూంటే గానెరిల్ గాని, రేగన్‌గాని వద్దనలేదు.

అంతకంతకూ గాలివాన రెచ్చిపోతున్నది. లియర్ పరివారం చెల్లాచెదరై పోయింది. ఎక్కడా చెట్టు అన్నది లేక అంతులేని మైదానంపైన లియర్ రాజు తుఫానులో చిక్కుకుపోయాడు. ఆయనవెంట విదూషకుడు మాత్రమే ఉన్నాడు. లియర్ రాజు ఉరుములనూ, మెరుపులనూ, గాలివాననూ లక్ష్యపెట్టలేదు. కృతజ్ఞత అన్నది ఎరగని మానవ జాతిని రూపు మాపమని ఆయన తుఫానును హెచ్చరించాడు.

ఆ తుఫానులో కెంట్ నౌకరువేషంలో తన యజమానిని వెతుక్కుంటూ వచ్చి, "అయ్యో, మీరిక్కడ ఉన్నారా? ఈ తుఫానుకు వెరిచి జంతువులుకూడా ఎక్కడో తల దాచుకున్నాయికదా!" అన్నాడు.

బయట చెలరేగే తుఫానుకంటె పెద్దది లియర్ మనసులో చెలరేగుతూ ఉండటం వల్ల ఆయనను బయటి తుఫాను బాధించ లేదు. కాని కెంట్ ఆయనను ఆ మైదానంలోనే ఉన్న ఒక గుడిసెకు చేర్చాడు. అక్కడ అదివరకే ఒక బిచ్చగాడు తల



దాచుకునిఉన్నాడు. వాణ్ణి చూసి లియర్, "కృతజ్ఞత లేని కూతుళ్లే వీణ్ణి ఈ దశకు తెచ్చి ఉంటారు!" అన్నాడు. ఆయనకు క్షణ క్షణమూ పిచ్చి జాస్తి అవుతున్నది. తెల్ల వారు జామున కెంట్ లియరును డోవర్ అనే రేవునగరం చేర్పించి తన మిత్రులవద్ద ఉంచి, తాను నౌకలో ఫ్రాన్సుదేశానికి బయలుదేరాడు.

తన తండ్రికి పట్టిన గతికి కార్డీలియా కన్నీరు కార్చింది. ఆమె తన భర్తను కోరి కొంత సైన్యాన్ని వెంటబెట్టుకుని బ్రిటనుకు వచ్చింది. అవసరమైతే తన అక్కలిద్దరినీ ఓడించి తన తండ్రిని మళ్లీ రాజును చెయ్యాలని ఆమె సంకల్పం.

కార్డీలియా తన సైన్యంతో డోవర్‌లో దిగే సమయానికి లియర్ తప్పించుకుని పారిపోయి డోవర్ పరిసరాలలో తిరుగుతూ సైనికుల కంట పడ్డాడు. ఆయన నెత్తిన ఒక గడ్డి కిరీటం ఉన్నది, ఆయన వెర్రిమొర్రి పాటలు పాడేస్తున్నాడు. వైద్యుడు చికిత్స చేసినమీదట లియర్ స్థితి కొద్దిగా బాగుపడింది. ఆయన తన మంచం దగ్గరకు వచ్చిన కార్డీలియాను గుర్తించాడు, ఆమెకు క్షమాపణ చెప్పుకున్నాడు.

కార్డీలియా సైన్యాలతో పోరాడటానికి గానెరిల్, రీగాన్‌లు ఒక సైన్యాన్ని పంపారు. దానికి సేనానాయకుడు గ్లౌస్టర్ ప్రభువు అనే వాడు. ఈ గ్లౌస్టరు ప్రభువును గానెరిల్, రీగాన్‌లు రహస్యంగా ప్రేమించారు. ఈ సంగతి బయటపడగానే గానెరిల్ తన చెల్లెలికి విషంపెట్టి చంపి, తానుకూడా విషం తాగి చనిపోయింది.

యుద్ధంలో కార్డీలియా సైన్యం ఓడిపోయింది. ఆమె గ్లౌస్టరుకు బందీగా దొరికింది. ఆమె జీవించిఉంటే తనకు సింహాసనం దక్కదని గ్లౌస్టర్ ఆమెను చంపించాడు. ఆమె మరణించటం చూసి గుండె పగిలి లియర్ కూడా మరణించాడు.






పూర్వం రోముదేశంలో యూనాన్ అనే రాజు ఉండేవాడు. ఆయన గొప్ప శక్తిమంతుడు, ఆయనకింద అనేక సామంతరాజులుండేవారు. అయితే ఆయనను ఏదో చర్మవ్యాధి పట్టుకుని పీడించసాగింది. దానికి మహామహా వైద్యులుకూడా చికిత్స చేయలేకపోయారు. రాజుగారు ఎన్నో గుళికలు మింగాడు, కషాయాలు తాగాడు, ఒంటికి లేపనాలు పూయించుకున్నాడు; కాని అన్నీ వృథా అయాయి. ఇక నా వ్యాధిని ఎవరూ నయంచేయలేరు, అనుకున్నాడు రాజు.

ఇలా ఉండగా ఆ దేశానికి రయ్యాన్ అనే ఒక ముసలి వైద్యుడు వచ్చాడు. రయ్యాన్ అనేక రకాల వైద్యంలో నిపుణుడైన ఘన వైద్యుడు. రాజుగారిని పీడించే చర్మవ్యాధి గురించి వినగానే ఆయన రాజభవనానికి వెళ్లి, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, తమరు అనుమతించినట్టయితే తమరిని పీడించే వ్యాధిని నేను నివారణ చేస్తాను," అన్నాడు.

"నీవు నా వ్యాధి నివారణ చేసేటట్టయితే నిన్ను అపార ధనవంతుణ్ణి చేసి, నా అంతరంగికులలో ఒకణ్ణిగా ఉంచుకోనా?" అన్నాడు రాజు.

"మీ వ్యాధి తప్పక నయమవుతుంది. మీకు కొంచెమైనా బాధ కలగకుండా చికిత్స జరిగేలాగు చేస్తాను," అన్నాడు ముసలి వైద్యుడు.

తరవాత వైద్యుడు ఒక ఇల్లు తీసుకుని ఒక ఔషధం తయారుచేశాడు; ఒక కొయ్య గూటం తీసుకుని దానిలో ఒక బొక్క పెట్టి అందులో ఔషధం వేసి, రంధ్రంలో ఒక పొడుగుపాటి పట్టుకర్ర అమర్చాడు. అది ఒక కొయ్య సమ్మెటలాగా తయారయింది. వైద్యుడు దానిని తీసుకుపోయి రాజుగారికిచ్చి, "మహారాజా, మీరీనాడు ఈ సమ్మె

జె. నాగభూషణం




టతో 'పోలో' ఆట ఆడండి. మీ అరిచేతులకు చెమట పట్టినదాకా ఆడారంటే మీ వ్యాధి నయమవుతుంది!" అన్నాడు.

"పోలో" ఆట ఆడేవాళ్లు గుర్రాలపై ఎక్కి నేలమీద ఉన్న బంతిని కొయ్య సమ్మెటలతో కొడుతూ ఆడతారు. రాజుగారు తన సిబ్బందితోసహా గుర్రాలపైన బయలుదేరి వైద్యుడిచ్చిన సమ్మెటతో, అరిచేతులకు బాగా చెమట పట్టినదాకా ఆడాడు.

తరవాత వైద్యుడు రాజుగారిని స్నానశాలకు తీసుకుపోయి, చక్కగా స్నానం చేయించి, పడుకోబెట్టి నిద్రపుచ్చి, తాను తన ఇంటికి వెళ్లిపోయాడు.

నిద్ర లేచి చూసుకునేసరికి రాజుగారి చర్మవ్యాధి జాడకూడా కనిపించలేదు. ఆయన ఆనందానికీ, ఆశ్చర్యానికీ మేర లేదు. మర్నాడు వైద్యుడు సభకు రాగానే రాజు ఆయనను కౌగలించుకుని, అంతులేని కానుకలు సమర్పించాడు.

అదిమొదలు రాజుగారికి వైద్యుణ్ణి ప్రశంసించటం తప్ప మరొకపని లేదు. "ఇలాటి వైద్యుడు ప్రపంచంలో మరొకడుంటాడా? ఇతను నాకు ఒక్క మందివ్వలేదు, ఒక్క పూత పుయ్యలేదు. కొయ్యగూటంలో ఉంచిన మందును నా శరీరంలోకి పంపించి ఏ వైద్యుడూ చేయలేకపోయిన చికిత్స చేశాడు!" అని రాజు వైద్యుణ్ణి మెచ్చుకోసాగాడు. రోజూ సభలో వైద్యుడే ప్రధాన విషయం. రోజూ ఆ వైద్యుడికి రాజుగారు ఏవో కానుకలు ఇస్తూనే ఉండేవాడు.

ఇదంతా చూసి మంత్రికి మండిపోయింది. రాజుకూ వైద్యుడికీ మధ్య విభేదం కల్పించాలనే ఉద్దేశంతో అతను రాజుగారిని ఒకనాడు ఒంటరిగా కలుసుకుని, "మహారాజా, మీకు నచ్చకపోయినా హితం చెప్పటం మా ధర్మంగదా. తమరు ఈ ముసలి వైద్యుణ్ణి చేరదీసి ప్రమాదం తెచ్చుకుంటున్నారు," అన్నాడు.



"నీకేమైనా మతిపోయిందా ఏమిటి? రయ్యాన్‌లాటి వైద్యుడు ప్రపంచంలో మరొకడు లేడు. ఎంతటి మేటివైద్యులూ కుదర్చలేకపోయిన నా చర్మవ్యాధిని ఆయన ఎంత సులువుగా, గారడీ చేసినట్టుగా, నయంచేశాడో నీవు చూడలేదా? అటువంటి వైద్యుడికి ఆశ్రయమివ్వటంలో అపాయ మేమున్నది?" అన్నాడు రాజు.

"మహారాజుగారు దూరం ఆలోచించటం లేదు. ఈ రయ్యాన్ అలాటి శక్తి కలవాడు కావటమే ప్రమాదం. అంత వైద్యం చేతిలో ఉన్నవాడు మీ చేతికి మరొకటి ఏదో ఇచ్చి నిమిషాలమీద మీ ప్రాణం హరించగలడు!" అన్నాడు మంత్రి.

"అదీ నిజమే. ఇంతకూ నీ సలహా ఏమిటి?" అని రాజు మంత్రిని అడిగాడు.

"నా సలహా వైద్యుడి తల తీయించటమే! ఆయనకు వ్యవధి ఇవ్వటం అపాయం. అందుచేత ఆయనను పిలిపించి, రాగానే తల కొట్టించెయ్యండి!" అన్నాడు మంత్రి.

"నీ సలహా బాగున్నది!" అంటూ రాజు వైద్యుడికోసం కబురుచేశాడు.

కొద్దిసేపటికల్లా వైద్యుడు వచ్చి రాజును, "నన్ను రమ్మన్నారట? ఏమి సెలవు?" అని అడిగాడు.




"నిన్ను తల తీయించటానికే పిలిపించాను," అన్నాడు రాజు.

వైద్యుడు నిర్ఘాంతపోయి, "ఎందుకు? నా వల్ల తమకు ఏమిద్రోహం జరిగింది?" అని అడిగాడు.

"నీవు నా ప్రాణం తీయటానికై వచ్చిన వేగులవాడివని ఇంతకుముందే తెలిసింది. ముందు నేనే దెబ్బతీస్తున్నాను! చావటానికి సిద్ధపడు!" అంటూ రాజుగారు తలారివాణ్ణి కేకవేశాడు.

"మహారాజా, మీకు ఎవరో విషం పోశారు. కానివ్వండి, దైవనిర్ణయం ప్రకారం అందరూ చావవలసిందే. నాకల్లా ఒక్కటే

విచారం. నా బసలో ఒక అమూల్యమైన వైద్యగ్రంథం ఉన్నది. దానిని తమరు నా కానుకగా స్వీకరించండి. అందులో అనేక అపూర్వమైన రహస్యాలున్నాయి. నా తల తీసేసినాక ఆ తలచేత మీరు మాట్లాడించ వచ్చు. ఆ రహస్యంకూడా ఆ గ్రంథంలో ఉన్నది!" అన్నాడు వైద్యుడు.

రాజుగారికి ఆ గ్రంథం వెంటనే చూడా లన్న కాంక్ష కలిగింది. ఆయన తన నౌక రును వైద్యుడి బసకు పంపించి, వైద్యుడి పుస్తకాలు తెప్పించాడు. వాటిలో ఒక పుస్తకాన్ని రాజుగారికి చూపి వైద్యుడు, "మహారాజా, అదే నేను తమకు చెప్పిన గ్రంథం!" అన్నాడు.

రాజుగారు ఆత్రంగా ఆ పుస్తకం పేజీలు తిప్పబోయాడు. కాని అవి ఒకదానికొకటి అంటుకుపోయి ఉండటంచేత రాజుగారు తన వేళ్ళను నాలుకకు అద్దుకుని పేజీలు వేరుచేయవలిసి వచ్చింది. కొన్నిపేజీలు తిప్పి రాజుగారు, "ఈ పేజీలన్నీ ఖాళీగానే ఉన్నాయే?" అన్నాడు.

"ఇంకా తిప్పండి. మూడు పంక్తులు ఎడమచేతి పేజీలో రాసి ఉంటాయి," అన్నాడు వైద్యుడు.

మరి మూడు నాలుగు కాగితాలు తిప్పి రాజుగారు విరుచుకు పడిపోయాడు. అందరూ హాహాకారాలుచేసి ఆయనను పరీ క్షించే లోపుగా ఆయన ప్రాణాలు పోనే పోయాయి. ఎందుచేతనంటే రాజుగారు తిప్పిన కాగితాలకు అతి ఘూరైన విషం అదివరకే పూసి ఉన్నది. రాజుగారు తన వేళ్ళను నాలుకకు అద్దుకున్నప్పుడల్లా కొంచెం కొంచెంగా ఆ విషం ఆయన శరీ రంలో ప్రవేశించింది.

ఈ విధంగా మంత్రి చెప్పుడుమాటలు విని కృతఘ్నుడై తనకు మేలుచేసిన వైద్యుణ్ణి చంప యత్నించిన యూనాన్‌రాజు తన ప్రాణాలను తానే తీసుకున్నాడు.





# సాహసికుడు



కొంకణతీరాన గల పర్వతాలలో ఒక కొండకు భూతాలకొండ అని పేరుండేది. చుట్టుపక్కల కొండలపైన ఆవులను మేపుకునే వారెవరూ తమ ఆవులను ఆ కొండపైకి పోనిచ్చేవారు కారు. ప్రమాదవశాన ఏ ఆవులుగాని ఆ కొండమీదికి పోతే వాటిని తీసుకురావటానికి పశువుల కాపరులు ప్రయత్నించేవారు కూడా కాదు. ఎందుచేతనంటే ఆవులపై గల ఆశకొద్దీ ఆ భూతాల కొండపైకి వెళ్లి మళ్లీ తిరిగి వచ్చిన వారెవరూ లేరు.

భూతాల కొండపైన ఆవుల మందలుండేవి. ఉదయం కాగానే అవి కొట్టాలలో నుంచి బయటికి వచ్చి, కొండ అంతటా తిరిగి మేత మేసి, మళ్లీ సూర్యాస్తమయం వేళకు, ఎవరో తమను తోలినట్టుగా, కొట్టాలకు తిరిగి వచ్చేవి. కాని వాటివెంట ఎవరూ ఉండేవారు కారు. వాటికి ఎవరు పోషణ చేసేవారో, ఎవరు పాలు పితికేవారో ఆ పాలు ఏమయేవో బయటి ప్రపంచానికి తెలియదు. ఆ కొండమీదనే పశువుల కొట్టాలకు సమీపంలో ఒక పశువుల కాపరి గుడిసె కూడా ఉండేది. రోజూ సాయంకాలంపూట పొయి రాజేసినట్టుగా గుడిసె కప్పునుంచి పొగకూడా వస్తూండేది. అయినప్పటికీ భూతాల కొండపైన నరమానవుడెవడూ ఉన్న జాడ చూసినవారు ఆ ప్రాంతాల లేరు.

ఆ కొండపైన భూతాలున్నాయనీ, అవి అవకాశం దొరికినప్పుడల్లా చుట్టుపక్కల కొండలపైన ఉండే ఆవులను దొంగతనంగా ఎత్తుకుపోతాయనీ, వాటికోసం తమ కొండపైకి వచ్చినవాళ్లను అవి చంపేస్తాయనీ చెప్పుకునేవారు.

ఆ భయంతోనే భూతాల కొండపైకి సాహసించి ఎవరూ వెళ్లేవారు కారు.

ఎస్. కుమారస్వామి




ఇలా ఉండగా ఆ ప్రాంతాలకు సత్య పాలుడనే పశువుల కాపరి ఒకడు కొత్తగా వచ్చాడు. వాడు భూతాల కొండలో నిత్యమూ జరిగేదంతా చూశాడు, భూతాలను గురించి ఇతరులు చెప్పేదంతా విన్నాడు. సత్యపాలుడు యువకుడూ, సాహసికుడూ కావటం చేత వాడికి ఆ భూతాల కొండపైకి వెళ్ళి, అక్కడ వాస్తవంగా జరుగుతున్నదేమిటో తెలుసుకోవాలనే కోరిక పుట్టింది.

మిగిలిన పశుకాపరులు వాడితో అలాటి సాహసం చెయ్యవద్దన్నారు, కాని వాడు వినలేదు. "కొండమీదికి వెళితే వెళ్లావు, ఆ గుడిసెలోకి మాత్రం వెళ్లకు. అందులోకి వెళ్ళి తిరిగి బయటికి వచ్చినవారెవరూ లేరు. మొండితనం చేసి వెళ్లావో నీగతీ అంతే అవుతుంది," అని మిత్రులు సత్యపాలుణ్ణి హెచ్చరించారు.

అయితే సత్యపాలుడుమాత్రం భయపడలేదు. వాడు ధైర్యంగా భూతాల కొండ మీదికి వెళ్లి అక్కడ ఉన్న గుడిసెవేపు నడిచాడు. అది మామూలు కొండలలాగే ఉన్నది కాని ఎక్కడా భయంకరమైన దృశ్యాలు లేవు. అంతటా నిశ్శబ్దంగా ఉన్నది. వాడు గుడిసెవద్దకు వెళ్లి లోపలికి తొంగి చూశాడు. మనుషులు నివసిస్తున్న గుడిసెలాగే ఉన్నది. "ఎవరు లోపల?" అని సత్యపాలుడు రెండు మూడుసార్లు కేక పెట్టినా, లోపలినుంచి జవాబు రాలేదు.

సంకోచించకుండా సత్యపాలుడు గుడిసెలో ప్రవేశించాడు. ఒక పక్కన పాత్రలలో భోజనం వండి సిద్ధంగా ఉన్నది. ఇంకొక పక్కగా మంచం వేసి ఉన్నది. దానిపైన పక్క పరిచి ఉన్నది.

"ఇక్కడ ఎవరో మనుషులే ఉంటున్నారు. బయటికి వెళ్లినట్టున్నారు. వారు తిరిగి వచ్చేదాకా విశ్రాంతి తీసుకుందాం!" అనుకుంటూ సత్యపాలుడు మంచంమీద శరీరం వాల్చాడు.



ఇంతలోనే గుడిసె బయట అలికిడి అయింది. ఒక రాక్షసుడులాటివాడు లోపలికి వచ్చాడు. వాడు నేరుగా వంటపాత్రలున్న చోటికి వెళ్ళి, "ఆ మంచంలో పడుకున్నవాడికికూడా వంట అయిందా?" అని గట్టిగా అరిచాడు. తరవాత ఆ భూతం సత్యపాలుడున్న చోటికి వచ్చి, "లే! అన్నానికి లే," అన్నాడు.

మరొకరైతే ఆ భూతాన్ని చూసి సగం చచ్చిపోవాలిసిందే. కాని సత్యపాలుడు భయపడలేదు. అతడు నిబ్బరంగా, "శ్రమపడ్డవాడే తిండి తినాలి. నేనేమీ శ్రమ చెయ్యలేదే!" అన్నాడు.

భూతం మారుమాటాడక వంటపాత్రల ముందు కూచుని క్షణంలో అన్నీ ఖాళీ చేసేశాడు. తరవాత వాడు గోడపక్క నుంచి ఒక పారా, పలుగూ తీసుకువచ్చి సత్యపాలుడికి అందిస్తూ, "ఇక మంచం దిగి, ఇవి తీసుకుని మాళిగలోకి నా వెంట రా!" అన్నాడు.

"మాళిగలోనుంచి నేనేమీ పైకి తేలేదు. అందుచేత నేను అక్కడికి ఏమీ తీసుకుపోనవసరం లేదు," అన్నాడు సత్యపాలుడు.

భూతం పలుగూ, పారా తానే తీసుకుని, "నా వెంట రా?" అన్నాడు.




"నువు ముందు పద, నేను వెనకగా వస్తాను!" అన్నాడు సత్యపాలుడు.

ఇద్దరూ నేలమాళిగలోకి దిగారు.

"ఇక్కడ తవ్వు!" అన్నాడు భూతం.

"అక్కడ నేనేమీ పాతిపెట్టలేదే!" అన్నాడు సత్యపాలుడు. భూతమే తవ్వాడు. కొద్దిసేపట్లో ఒక గుండిగ బయటపడింది.

"దాన్ని పైకి ఎత్తు!" అన్నాడు భూతం.

"నేను దాన్ని కిందికి దించితేగద, ఎత్తటానికి!" అన్నాడు సత్యపాలుడు.

భూతం ఆ గుండిగ ఎత్తి పైకి తీసి నేలపై ఉంచి, "దీని మీది మూత తియ్యి!" అన్నాడు సత్యపాలుడితో.

"నేను మూత పెట్టలేదు, అందుచేత దాన్ని తీసే అవసరం నాకు లేదు," అన్నాడు సత్యపాలుడు.

భూతం మూత తీశాడు. గుండిగనిండా బంగారు కాసులున్నాయి. భూతం వాటిని నేలమీద పోసి మూడు కుప్పలుగా చేసి, "ఇందులో నీకుప్ప ఏదో తెలుసుకో. సరిగా తెలుసుకున్నావా నువు బాగుపడతావు, నాకూ శాప విమోచనం అవుతుంది. నీదికాని కుప్ప ఏరుకున్నావో, నిన్ను పిడికెడు బూడిద చేసేసి, నన్ను రక్షించటానికి ఇంకొకడు వచ్చినదాకా నేనిలాగే జీవిస్తాను. నాకు శాప విమోచనం అయినపక్షాన ఈ కుప్పలలో ఒకటి నీదీ, రెండవది పేద ప్రజలదీ, మూడవది నాచేత చచ్చిపోయిన వారి భార్యా బిడ్డలదీను. తెలిసిందా ?" అన్నాడు.

సత్యపాలుడు తన చేతులతో మూడు బంగారుకాసుల కుప్పలనూ చుట్టి, "వీటిలో ఒకటి నాది!" అన్నాడు.

వెంటనే గుడిసెలో ఒక పెద్ద మెరుపు మెరిసినట్టయింది. భూతం మాయమై దాని స్థానంలో ఎవరో ఒక గంధర్వుడులాటివాడు నిలబడిఉండటం కనబడింది. అతను సత్యపాలుడితో, "నీ పుణ్యాన నాకు శాప విముక్తి కలిగింది. నేను పోతున్నాను. ఈ రోజుమొదలుకుని, ఈ కొండా, దీని మీది పశువులూ, ఈ బంగారమూ నీదే!" అని ఎటో మాయమైపోయాడు.

భూతాల కొండపైనుంచి సత్యపాలుడు సజీవంగా తిరిగి రావటం చూసి మిగిలిన పశువుల కాపర్లు చాలా ఆశ్చర్యపడ్డారు. వాడు వారితో కొండమీద జరిగిన సంగతి అంతా చెప్పాడు.

సత్యపాలుడు అది మొదలు భూతాల కొండపై నివాసం ఏర్పరచుకుని తనవంతు బంగారంతో సుఖంగా జీవించాడు. క్రమంగా ప్రజలు ఆ కొండను భూతాల కొండ అని పిలవటం మానేశారు.





# సవతితల్లి దీవన

పట్టువదలని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్లి, శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత శ్రమ పడుతూకూడా నీవు కార్యదీక్షను విడవకుండా ఉన్నావంటే అది ఘనమైన విషయమే. మామూలు మనుషులు చేసిన వాగ్దానాలనుకూడా చెల్లించుకోరు. ఇందుకు ఉదాహరణగా దేవలుడి కథ చెబుతాను విను!" అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

సింధూనదీ ప్రాంతంలో దేవలుడనే ఒక సామాన్య గృహస్థు ఉండేవాడు. అతను తనకు గల కొద్దిపాటి పొలంలో తన కుటుంబానికి కావలసినదంతా పండించుతూ, ఏ లోటూ లేకుండా తన భార్యతోనూ, కొడుకుతోనూ జీవిస్తూండేవాడు.

ఇంతలో దేవలుడి భార్యకు జబ్బు చేసింది. ఆ జబ్బు ఏ చికిత్సకూ లొంగలేదు.

## బేతాళ కథలు




అమె తనకు చావు దగ్గిరపడిందని తెలిసి భర్తను పిలిచి, "నేను పోయాక నన్ను మరిచిపోవద్దు. మళ్లీ పెళ్లాడి మన పిల్లవాడికి సవతితల్లిని తెచ్చిపెట్టవద్దు. ఏ ఆడదానికైనా తన కడుపున పుట్టిన బిడ్డలపైన ఉండే మమకారం ఇతరుల బిడ్డలపైన ఉండదు. ఒకవేళ మళ్లీ పెళ్లాడినా ఈ సంగతి మరిచి పోవద్దు. పిల్లవాణ్ణి శ్రద్ధగా పెంచి పెద్ద చెయ్యాలి," అని చెప్పి కన్నుమూసింది.

దేవలుడు తన భార్యకోసం కొంతకాలం దుఃఖించాడు. ఆ దుఃఖం తగ్గిపోగానే రోహిణి అనే కన్యను మళ్లీ పెళ్లాడాడు. అదృష్ట వశాత్తూ రోహిణి బుద్ధిమంతురాలు. ఆమె తన సవతి కొడుకైన ఆనందుణ్ణి చాలా బాగా చూసుకునేది. ఇది చూసి దేవలుడు సంతోషించాడు. రోహిణి ఆనందుణ్ణి సరిగా చూడకపోతే తన మొదటి భార్య ఆత్మకు శాంతి ఉండేది కాదని అతను నమ్మాడు.

కాలం గడిచిపోతున్నది. ఆనందుడు చక్కగా చదువుకుంటున్నాడు. తండ్రి వాడికేవైనా పనిపాటలు నేర్పాలన్నా రోహిణి వాణ్ణి పని చెయ్యనిచ్చేదికాదు. ఆమె కడుపున ఒక మగపిల్లవాడూ, ఆడపిల్లా పుట్టారు. ముగ్గురూ ఒక్కతల్లి పిల్లల్లాగా అన్యోన్యంగా ఉంటూండేవారు.

దేవలుడికి ఒక ఆవు ఉండేది. అదిఅంటే అతనికి ప్రాణంకన్న ఎక్కువ. ఉన్నట్టుండి దానికి జబ్బుచేసింది. అనుభవంగల ముసలివాళ్లనందరినీ పిలిచి ఆవును చూపించాడు. ఎవరెవరు ఏయే చికిత్స చెయ్యమంటే అదెల్లా చేశాడు. కాని ఆవుకు పట్టిన రోగం నయంకాలేదు. అది నయమయే రోగం కాదనీ, ఆవుమీద ఆశ వదులుకోమనీ అందరూ సలహా ఇచ్చారు.

ఆ మాట వినగానే దేవలుడికి శూలాలతో పొడిచినట్టయింది. ఎన్ని అవస్థలైనా పడి ఆ ఆవును దక్కించుకోవాలని అతనికి కోరిక పుట్టింది. తన ఆవుకు ఎవరో చేతబడి



చేసి ఉంటారనీ, అందుచేత ఈ వ్యాధిని భూతవైద్యులు తప్పక కుదుర్చుతారనీ దేవ లుడు నమ్మాడు.

ఆ చుట్టుపక్కల రుద్రదేవుడని ఒక గొల్లవాడు భూతవైద్యం చేస్తాడు. అతను నది అవతలి ఒడ్డున ఒక కుటీరం వేసుకుని ఉంటున్నాడు. ఒకరోజు ఉదయం దేవ లుడు తెప్పమీద నదిని దాటి రుద్రదేవుడి గుడిసెకు వెళ్ళాడు. అతను అక్కడ కని పించకపోతే సమీపంలో ఉండే అరణ్యంలో వెతకసాగాడు.

చివరకు రుద్రదేవుడు అకస్మాత్తుగా ఒక చెట్టుచాటునుంచి దేవలుడి ఎదటికి వచ్చి, ఉరుములాటి గొంతుతో, "ఎవరు నీవు? నీకేం పని?" అని అడిగాడు.

దేవలుడు బెదిరిపోతూ తన ఆవుకు పట్టు కున్న జబ్బుగురించీ, అది ఏ చికిత్సకూ లొంగకపోవటం గురించీ భూతవైద్యుడితో చెప్పాడు. భూతవైద్యుడు హుంకరించి, "అవును. నీ ఆవుకు గాలి సోకింది. నీవు ఆడి తప్పావు. అందుకు శిక్షగా నీ ఆవుకు గాలి సోకింది!" అన్నాడు.

"స్వామీ, ఆ గాలిని మీరు ఎలాగైనా వదలగొట్టి నా ఆవు ప్రాణాలను కాపాడాలి!" అన్నాడు దేవలుడు.



"అందుకు ఒకటే ఉపాయం. నీ బిడ్డ లలో ఎవరి ప్రాణాలనైనా బలిచేశావంటే నీ ఆవు నీకు దక్కుతుంది," అన్నాడు భూతవైద్యుడు.

దేవలుడు నిర్ఘాంతపోయి, "నరబలి ఇవ్వటమా? అందులోనూ నేను కన్న బిడ్డ లలో ఒక బిడ్డనా? ఇది నావల్ల అయ్యే పని కాదు!" అన్నాడు.

భూతవైద్యుడు అరణ్యం మారుమోగే టట్టు నవ్వి, "పిచ్చివాడా, నీవు నీ బిడ్డను నరికి చంపనవసరం లేదు. ఏ బిడ్డను బలి ఇవ్వకోరుతావో నిశ్చయించుకో. ఆ బిడ్డ కళ్ల లోకి తేరిపార చూడు. ఆ బిడ్డకు తుమ్ము

వస్తుంది. నువు 'చిరంజీవ!' అని దీవించకు. మళ్లా బిడ్డ కళ్లలోకి చూడు, మళ్ళీ బిడ్డ తుమ్మినప్పుడు కూడా దీవించకు. ఈ విధంగా మూడు తుమ్ములు తుమ్మినాక ఇక ఆ బిడ్డ నీదికాదు. నీ ఆవేమో బతుకుతుంది. నీకు ఇష్టమైతేనే ఇలా చెయ్యి, లేకపోతే మానెయ్యి!" అన్నాడు.

దేవలుడు దీర్ఘాలోచనతోనూ, దిగులుతోనూ కుంగిపోయి ఇంటికి తిరిగి వచ్చాడు. తన ఆవును పట్టినది తన మొదటి భార్యే అయి ఉంటుందని దేవలుడికి తోచింది; తాను మళ్ళీ పెళ్లాడినందుకు ప్రాయశ్చిత్తంగా తన ఆవు ప్రాణాలు తీస్తుందికాబో లనుకున్నాడు. ఆనందుణ్ణి బలిచేసేస్తే తన ఆవు బతకటమే గాక ఇక ఎన్నటికీ తన మొదటిభార్య తన జోలికి రాదు. రోహిణి చాలా మంచిది. తన మొదటిభార్యకోసం రోహిణి సంతానాన్ని బలి ఇవ్వటం చాలా అన్యాయం. ఏవిధంగా చూసినా ఆనందుణ్ణి బలికానివ్వటమే సమంజసమని దేవలుడికి తోచింది. కాని ఆపని చెయ్యటానికి దేవలుడి అంతరాత్మ ఒప్పలేదు. ఎందుకంటే తన మొదటిభార్య పోయినాక అతను ఆనందుణ్ణి ప్రాణంకంటె ఎక్కువగా పెంచాడు.

"ఏంచేస్తాం? ఆవు చస్తే చస్తుంది!" అనుకుంటూ దేవలుడు తన ఇంట్లోకి అడుగు



పెట్టాడు. అంతలోనే రోగంతో తీసుకుంటున్న అవు అతని కంట పడింది. దానిని చూడ గానే దేవలుడి గుండె నీరయిపోయింది. వెంటనే అతను తన పెద్దకొడుకును బలిచేసి సాధ్యమైతే అవు ప్రాణాలు కాపాడుకోవ టానికి ధృఢనిశ్చయం చేసుకున్నాడు.

కొంచెంసేపటికి పిల్లలు ముగ్గురూ ఆటల నుంచి తిరిగివచ్చి అన్నాలకు సిద్ధమయారు. దేవలుడు అనందుణ్ణి దగ్గిరికి పిలిచి వాడి కళ్ళలోకి సూటిగా చూశాడు. అనందుడు ఒక్క తుమ్ము తుమ్మాడు. "చిరంజీవ!" అందామని నోటిదాకా వచ్చిందిగాని, దేవ లుడు నోరు కట్టేసుకున్నాడు.

అతను మళ్ళీ అనందుడి కళ్ళలోకి చూశాడు. వాడు మళ్ళీ తుమ్మాడు. తండ్రి దీవించలేదు. ఇంకొక్కసారి తాను అనం దుడి కళ్ళలోకి చూశాడంటే వాణ్ణి తాను హత్యచేసినట్టే. అయినా గుండె రాయిచేసు కుని దేవలుడు అనందుడి కళ్ళలోకి మూడోసారి చూశాడు. అనందుడు మూడో తుమ్ము తుమ్మాడు.

సరిగా ఆ సమయానికే అక్కడికి వచ్చిన రోహిణి, "చిరంజీవ! శతాయుః!" అని దీవించి, "ఏమిటి, వాడు వరసగా మూడు తుమ్ములు తుమ్మాడు! మీరు వాణ్ణి దీవించ నైనా దీవించరేం?" అని భర్తను కోప్పడింది.



ఏమైనా రోహిణి దీవించటంతో భూత వైద్యుడు చెప్పిన ప్రయోగం కాస్తా విఫలమయింది. ఆనందుడు ఆరోగ్యంగా ఉన్నాడు, ఆవు మటుకు ఆ రాత్రే ప్రాణాలు విడిచింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకో సందేహం. దేవలుడు ఆవుకోసం తన కొడుకును చంపుకోవటానికి ఎందుకు సిద్ధపడ్డాడు? అతనికి కొడుకుపైనకన్న ఆవుపైన ఎక్కువ ప్రేమ కావటంచేతనా? తన సొంత కొడుకు చావుకోసం దేవలుడు ప్రయత్నిస్తుంటే సవతితల్లి అయిన రోహిణి వాణ్ణి దీవించి వాడి ప్రాణాలు ఎందుకు కాపాడింది? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది!" అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవలుడు తన కొడుకును చంపటానికి సిద్ధపడటానికి అసలు కారణం ఆవుపైన ఎక్కువ ప్రేమ ఉండటమూకాదు, కొడుకుపైన తక్కువ ప్రేమ ఉండటమూకాదు. తన భార్య ఆఖరు కోరిక పాటించక మళ్ళీ పెళ్ళిచేసుకున్నందుకు అతని అంతరాత్మలో తాను తప్పుచేశానన్న సంకోచం ఉండిపోయింది. కొడుకును చావనిస్తే ఆ తప్పు చక్కబడుతుందని అపోహపడ్డాడు దేవలుడు. పాపభీతి కల వాళ్ళు ఈవిధంగానే ఒక తప్పుతరవాత మరొక తప్పు చేస్తారు. ఇక రోహిణి మనస్సు నిర్మలమైనది. అందుచేత ఆమె తన సవతి కొడుకును దీవించింది. మంచి మనసు గల వాళ్ళెవరైనా అలాగే చేస్తారు. భార్యాభర్తలిద్దరి ప్రవర్తనలోనూ ఉన్నతేడా వారి మనస్సులలో ఉండే తేడానుబట్టి ఏర్పడింది గాని, ఆనందుడికీ వారికీ ఉండే బంధుత్వాన్నిబట్టి ఏర్పడినదిగాదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# బంగారు కలశం

ఒక దేశంలో ఇద్దరు మిత్రులుండేవారు. ఒకడి పేరు ధర్మయ్యా, రెండోవాడిపేరు దానయ్యా. ఇద్దరూ చెరొక గ్రామంలోనూ ఉండేవారు. ధర్మయ్యా ఉండే గ్రామం చుట్టూ మంచిమంచి పొలాలూ, తోటలూ ఉండేవి; అది సుక్షేత్రం. కాని దానయ్యా ఉండే గ్రామంచుట్టూ కొండలు తప్ప ఏమీ లేవు; అది రాతిభూమి.

ఒకసారి ధర్మయ్యా దానయ్యా వద్దకు వచ్చాడు. అసలే తిండి సమస్యా జాస్తిగనక దానయ్యా తన అతిథిని వెంటబెట్టుకుని కంద మూలాలు తవ్వుకు రావటానికి కొండలలోకి వెళ్ళాడు. ఇద్దరూ దుంపలకోసం తవ్వుతూం డగా వారికి ఒక బంగారు కలశం దొరికింది.

"ఇవాళ మనం లేచిన వేళ మంచిది. దీన్ని అమ్మి చెరిసగమూ తీసుకున్నామంటే మన ఇద్దరి దరిద్రమూ తీరిపోతుంది," అన్నాడు ధర్మయ్యా.

కాని దానయ్యాకు ఆ కలశాన్ని కాజేసి దాని కిమ్మత్తు యావత్తూ తనకే ఉంచు కోవాలన్న దుర్బుద్ధి పుట్టింది. అతను ధర్మ య్యతో, "ఇది బంగారంతో చేసిన కలశ మని నాకు తోచటంలేదు. ఎవరుగాని బంగారు కలశాన్ని ఈ కొండలమీద ఎందుకు పాతిపెడతారు? సత్తో, తగరమో అయి ఉంటుంది!" అన్నాడు.

ధర్మయ్యా నవ్వి, "పరీక్షించి చుద్దాం. బంగారం కాకపోతే మనకు కలిగే నష్టమే మిటి? మనం దీనికోసం ప్రత్యేకించి శ్రమ పడలేదుగదా! దుంపలకోసం తవ్వుతుంటే దొరికింది!" అన్నాడు.

తరవాత ఆ కలశాన్ని తీసుకుని మిత్రు లిద్దరూ దానయ్యా ఇంటికి వెళ్ళారు. మర్నాడు ధర్మయ్యా తన గ్రామానికి బయలు దేరి పోతూ, "ఆ కలశాన్ని ఎప్పుడు పరీక్షిం తామంటావు?" అని అడిగాడు.

టి. ప్రసాదరావు




"నా దగ్గిరే ఉండనీ. వీలుచూసుకుని పరీక్షించి, బంగారమైతే అమ్మేసి నీ వంతు సొమ్ము నేనే తెచ్చి ఇస్తాను!" అన్నాడు దానయ్య.

స్నేహితుడి యందు విశ్వాసం ఉంచి ధర్మయ్య తన గ్రామానికి వెళ్లిపోయాడు. అతను వెళ్ళగానే దానయ్య కలశాన్ని కరిగించి, బంగారం అమ్మి, ఆ వచ్చిన డబ్బు దాచుకుని స్నేహితుడికి కబురుచెయ్యక ఊరుకున్నాడు.

దానయ్య వద్దనుంచి ఎంతకాలానికీ కబురు తెలియకపోవటం చూసి ధర్మయ్య బయలుదేరి వచ్చాడు. దానయ్య అన్ని విషయాలూ మాట్లాడాడుగాని కలశం మాట మాత్రం ఎత్తలేదు.

"ఇంతకూ ఆ కలశం పరీక్ష చేయించావా? ఏమయింది?" అని ధర్మయ్య అడిగాడు.

"అన్నట్టు దాని మాటే మరిచాను. అది బంగారమే కాదు. నేను మొదటినుంచీ అనుమానిస్తూనే ఉన్నాను. నిప్పులో పెట్టగానే అది కరిగి నీరైపోయింది. తగరపు కలశం!" అన్నాడు దానయ్య.

దానయ్య అబద్ధం ఆడుతున్నాడని ధర్మయ్యకు తెలిసిపోయింది. తగరం బంగారంలా మెరవదు. అదీగాక దానయ్య నిజాయితీ గలవాడైతే ఆ తగరమైనా తనకు చూపి ఉండవలసింది.

అయితే ధర్మయ్య తాను నిజం తెలుసుకున్నట్టు ఏమాత్రం బయటపడక, "ఓస్, తగరమేనా? నేనింకా బంగారమనుకుని ఆశపడ్డాను!" అన్నాడు.

అతను ఆ రోజల్లా దానయ్య ఇంట ఉండి మర్నాడు బయలుదేరి పోతూ, "చూడు, దానయ్యా! మా ఊళ్ళో తోటల నిండా పళ్ళే! ఈ ఎడారిలో మీకు పండే కంట పడదాయె. నీ కొడుకునూ, కూతుర్నీ నా వెంట పంపరాదా? వాళ్ళు హాయిగా

రోజల్లా పళ్ళు తినవచ్చు, తోటల్లో ఆడుకో వచ్చు," అన్నాడు.

దానయ్య సరేనని తన కొడుకునూ, కూతుర్నీ ధర్మయ్యవెంట పంపాడు. వారికి దారిలో కోతులు కనిపించాయి. దానయ్య పిల్లలిద్దరూ కోతులనూ వాటి పిల్లలనూ చూసి ఆనందిస్తూ నిలబడిపోయారు. ఇది చూసి ధర్మయ్య వాళ్లకోసం రెండు కోతి పిల్లలను పట్టుకుని, సాయంకాలానికల్లా ఇంటికి చేరాడు.

ధర్మయ్య ఇంటికి వచ్చిన దానయ్య పిల్లలకు జీవితం ఎంతో సరదాగా ఉన్నది. ఇంట్లో ఉన్నప్పుడు వాళ్ళు కోతులతో ఆడుకునేవాళ్లు. వాటికి వాళ్లు తమ పేర్లే పెట్టుకున్నారు; ఆ పేర్లు పెట్టి పిలిస్తే అవి ఎక్కడ ఉన్నా పరిగెత్తుకుంటూ వచ్చేవి. పిల్లలు ఇంట్లో లేనప్పుడు తోటల్లో తిరిగి మనసైన పళ్లన్నీ తినేవారు; ఇంటికి వచ్చేటప్పుడు తమ పెంపుడు కోతుల కోసం కొన్ని పళ్లు తెచ్చేవారు.

ఇలా కొంతకాలం గడిచినాక దానయ్యకు తన పిల్లలమీద గాలి మళ్లింది. వారిని చూద్దామనీ, వాళ్లు వస్తామంటే వెంట తీసుకువద్దామనీ నిశ్చయించుకుని దానయ్య తాను ఫలాని రోజున వస్తున్నట్టు ధర్మయ్యకు కబురుచేశాడు.



ఆ రోజు ఉదయమే ధర్మయ్య దానయ్య పిల్లలతో, "మీరు వెంటనే వెళ్ళి తోటల్లో ఆడుకోండి. బోజనంవేళదాకా ఇంటికి రావద్దు!" అని చెప్పాడు. పిల్లలు తోటల్లోకి వెళ్ళిపోయారు.

కొద్దిగా పొద్దెక్కిన తరవాత దానయ్య ధర్మయ్య ఇంటికి వచ్చాడు. మామూలు కుశల ప్రశ్నలు అయాక ఆయన తన స్నేహితుణ్ణి, "నా పిల్లలు ఎటు పోయారు? కని పించరేం?" అని అడిగాడు.

"ఎక్కడో ఆడుకుంటున్నారు గామాలు, పిలుస్తాను!" అంటూ ధర్మయ్య పిల్లలిద్దరినీ పేరున పిలిచాడు. ఆ పేర్లతో పిలిస్తే రావటం కోతి పిల్లలకు అలవాటు. అందుచేత అవి వెంటనే పరిగెత్తుకుంటూ వచ్చి ధర్మయ్యమీదికీ, దానయ్య మీదికీ కూడా ఎక్కాయి. అవి మనుషులకుకూడా బాగా అలవాటుపడి ఉండటంచేత వాటికి పాతా కొత్తా విచక్షణ లేదు.

"ఏమిటిది?" అన్నాడు దానయ్య తెల్లబోతూ.

"వీళ్ళు నీ పిల్లలే! నేను తీసుకువచ్చిన కొద్ది రోజులకే ఇలా మారిపోయారు. కారణం తెలీదు!" అన్నాడు ధర్మయ్య.

దానయ్యకు బుద్ధి వచ్చింది. అతను తన మిత్రుడి చేతులు పుచ్చుకుని, "ధర్మయ్యా, బుద్ధి గడ్డితిని ఆ కలశం విషయం నీతో అబద్ధమాడాను. అది బంగారు కలశమే. నా పిల్లలను నాకు మళ్ళీ వప్పగించు, నీకు కలశం అమ్మగా వచ్చిన డబ్బులో సగం భాగం ఇచ్చేస్తాను!" అన్నాడు.

ధర్మయ్య నవ్వి, "నీ పిల్లలను నేను కాజేస్తాననుకున్నావా? ఇప్పుడే పిలుచుకు వస్తానుండు!" అంటూ తోటల్లోకి వెళ్లి పిల్లలిద్దరినీ వెంటబెట్టుకు వచ్చాడు. దానయ్య పిల్లలను తనవెంట తీసుకుపోయి కలశం అమ్మగా వచ్చిన దానిలో సగం ధర్మయ్యకు పంపించాడు.






# చీమలు

## 2

ఉత్తర ఆఫ్రికాలో "తలలు తీసే" జాతి చీమలున్నాయి. ఈ జాతికి చెందిన "రాణి" కొత్త నివాసాన్ని వెతుక్కుంటూ తన జాతి కన్న చాలా పెద్దచీమలు నివసించే పుట్ట వద్దకు వెళ్లి, దాని "ద్వారం"వద్ద తారట్లాడుతుంది. పుట్టలో ఉండే "శ్రామిక" చీమలు వచ్చి ఈ విజాతి "రాణి"ని పట్టుకుని లోపలికి తీసుకుపోతాయి. ఏ కారణం చేతనో అవి దాన్ని చంపవు. ఈ "రాణి" పుట్టలో ఉన్న అసలు రాణిపైన ఎక్కి దాని కంఠాన్ని నరికేస్తుంది. "శ్రామిక" చీమలు ఈ కొత్త రాణినీ, ఆమె సంతానాన్నీ కొలుస్తాయి. కాలక్రమాన పుట్టలో కొత్తరాణి సంతతి మాత్రమే మిగిలిపోతుంది.

ఈవిధంగా దోపిడీచేసి బతికే చీమలు స్వయంగా ఇళ్ళు ఏర్పాటు చేసుకోలేవు, ఇతర జాతి చీమలను నిర్మూలించి వాటి, "స్థావరాలు" ఆక్రమించవలిసిందే. ఇలా చేస్తూ పోగాపోగా స్థావరాలు నిర్మించగల చీమలజాతి అంతరించిపోవచ్చు. ఆ తరవాత దాడి చేసే చీమలజాతి అంతరించటానికి ఎంతో కాలం పట్టదు.

"ఎమెజాన్" చీమలు కేవలం యుద్ధమే వృత్తిగా గలవి. వీటికి వాడిఅయిన "ముక్కు" లుంటాయి. ఇవి "ఫార్మికా" చీమల పుట్టలలో జొరబడి వాటి "రాణులను" ఈ ముక్కులతో తలలో పొడిచి చంపేస్తాయి, అక్కడి "శ్రామికులను" బానిసలుగా తీసుకుంటాయి. ఈ ఎమెజాన్ చీమలు అప్పుడప్పుడూ ఫార్మికా చీమల పుట్టలపై దాడి చేసి గుడ్లను తమ పుట్టలకు తీసుకువస్తాయి.

"ఫార్మికా" జాతి చీమలు సనాతన ధర్మాన్ని అవలంబిస్తున్నాయని చెప్పవచ్చు. అవి కష్టించి పని చేసి తమ ధర్మాన్ని తప్ప



కుండా నడుచుకుంటూ, ఇతర జాతుల చీమల దాడులకు తరుచు గురి అవుతుంటాయి. అంతేగాక ఇతర కీటకాలు వాటి పుట్టలలో శాశ్వతంగా కాపరాలు పెట్టి వాటి "ఆతిథ్యం" పైన జీవిస్తూంటాయి.

చీమల నాగరికతలో సనాతన ధర్మం ఇంకొక విధంగాకూడా మనం చూడవచ్చు. ఒకే పుట్టలో రెండు రకాల చీమలు రెండు భాగాలు ఆక్రమించుకుని వేటి జీవితం అవి గడుపుతూ సహజీవనం సాగించటమే గాక, సమిష్టి క్షేమాన్నికూడా సాధించటం కద్దు.

చీమలకు రెండు పొట్టలుంటాయి. ఒక పొట్టలోకి వెళ్లిన ఆహారం చీమ కడుపులో జీర్ణమైపోతుంది. రెండవ పొట్ట న్యాయంగా చీమ సొంతం కాదు; అందులోని ఆహారం సమిష్టికి చెందినది. తమవెంట ఉండే "అతిథులు" ఆహారం అడిగితే చీమలు తమ బిడ్డలనుకూడా లక్ష్యపెట్టక ఇచ్చేస్తాయి!

మనం ఆవులను పెంచి, వాటి పాలు పిండుకు తాగినట్టుగా చీమలుకూడా తమ "ఆవులను" పెంచుతాయి. ఇవి చెట్ల వేళ్లను ఆశ్రయించి చెట్టుయొక్క సారంపైన బతికే గోమార్లలాటి ప్రాణులు. చీమలు ఈ "ఆవులను" నిమిరితే ఒక తేనెద్రవంలాటి ఆహార పదార్థం వెలువడుతుంది. చీమలకు అది మంచి ఆహారం. ఎండాకాలం వచ్చి చెట్లలో సారం తరిగిపోయే సమయానికి చీమలు తమ ఆవులను సారవంతమైన మరొక ప్రదేశానికి చేర్చి అక్కడ మేపుతాయి!

"దర్జీ" చీమలు అని ఒకరకం వింత చీమలున్నాయి. ఇవి ఆకులమధ్య గూళ్ళు కడతాయి. చీమలు కీటకా లన్నిటిలాగే మొదట "లార్వా" దశలో ఉండి, తరవాత "ప్యూపా" దశలోకి మారినప్పుడు తమ చుట్టూ సన్నటి దారంతో గూడు అల్లుకుంటాయి. పెద్దచీమలు ఈ దశలో ఉండే తమ పిల్లలచేత దారం పేనించి దానితో ఆకులను ఒకదాని కొకటి అంటుకుపోయేలాగు

చేసి తమ నివాసాన్ని సురక్షితం చేసుకుంటాయి! "దర్జీ" చీమలు సాధారణంగా ఆకుపచ్చగా ఉంటాయి. ఇవి సామాన్యంగా చెట్ల చిటారు కొమ్మలలో నివసిస్తాయి.

"మంట" చీమలు కుట్టితే శరీరం మంట ఎత్తుతుంది. ఇవి ఎక్కడబడితే అక్కడ అత్యధిక సంఖ్యలో నివసిస్తాయి. వీటి సంఖ్య అతి శీఘ్రంగా వృద్ధి అవుతుంది. వీటికి నీటి భయంకూడా లేదు. వరదలు వచ్చినప్పుడివి తమ "రాణి"నీ, దాని పిల్లలనూ మధ్య ఉంచి, వాటి చుట్టూ తాము బంతి ఆకారంలో తయారై నేలగాని, చెట్టుగాని ఉన్న వేపు దొర్లుకుంటూ పోతాయి.




చీమ "రాక్షసులు"

చీమలలోకూడా "అనాగరిక" జాతి చీమలున్నాయి, అవి "రాక్షసి" చీమలు. ఇవి కేవలం వేటాడి జీవిస్తాయి. వీటికి ఒక చివర బలమైన నోరూ, రెండో చివర విషపు కోరా ఉంటాయి. ఇవి అధికంగా ఉష్ణమండలంలో ఉంటాయి. వీటిలో చాలా చిన్నవి మొదలుకొని అంగుళంకన్న ఎక్కువ నిడివి గలవి కూడా ఉన్నాయి. బొలీవియాలో ఉండే ప్రజలు రాక్షసిచీమలు వస్తే తమ మొక్కజొన్న పొలాలు వదిలి పారిపోతారు. వీటిని అక్కడివారు "బునీ" చీమలంటారు. వాటి నిడివి అంగుళానికి కొంచెం తక్కువ. ఇంతకంటెకూడా పెద్ద "రాక్షసి" చీమలు దక్షిణ అమెరికా భూమధ్యరేఖ ప్రాంతంలో ఉన్నాయి. అలాగే ఆస్ట్రేలియాలో ఉండే "బుల్ డాగ్" చీమలు కూడా భయంకరమైనవి.

వేటాడే చీమలు హెచ్చుగా చెదలను తింటాయి. ఒకొక్కప్పుడు తమ పుట్టలను చెదల పుట్టల సమీపంలోనే నిర్మించుకుంటాయికూడా. కొన్ని రకాల చీమలు సేనలు కదిలినట్టు కదిలి, దారిలో తగిలిన ప్రాణులను నిర్మూలించుకుంటూ పోతాయి. వీటికి కళ్ళుండవు గనక, చిన్న జంతువు




పెద్ద జంతువు అన్న విచక్షణ లేకుండా, దేన్ని పడితే దాన్ని ఎదుర్కొంటాయి. వాటి దారిలో బొరియలు కనిపిస్తే వాటిలోకి దిగుతాయి, చెట్లు తగిలితే వాటిని ఎక్కుతాయి. ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో అసంఖ్యాకమైన "సిపాయి" చీమలు గుంపులుగా సంచారం చేస్తాయి. ఏనుగులవంటివి సయితం అవి వచ్చే దారికి అడ్డు నిలబడక తొలగిపోతాయుట!

ఈ "యోధులకు" ఏదైనా ప్రవాహం అడ్డు తగిలితే అవి ఒడ్డున ఆగిపోయి, ఒక దాని కాళ్ళను మరొకదాని కాళ్ళు పెనవేసి ఒక వంతెనలాగా తయారవుతాయి. వంతెన పూర్తికాగానే మిగిలిన చీమలు వాటిమీదుగా నడిచి అవతలి ఒడ్డుకు పోతాయి.

చీమల నిత్యజీవితం

"రాణి" చీమకు పిల్లల్ని కనటం తప్ప మరేపనీ లేదు. ఈ "రాణులు" దీర్ఘజీవులు, 17 సంవత్సరాలపాటు జీవించి పిల్లలను పెట్టి తమ వంశాన్ని వృద్ధిచేసిన రాణికూడా ఉన్నది. ఇంటిపనులన్నీ "శ్రామిక" చీమలే చూస్తాయి. అవి పిల్లలను మేపుతాయి, ఆహారం తెస్తాయి.

సాధారణంగా చీమలు ద్రవాహారమే తీసుకుంటాయి. పురుగుల ముక్కలను నోట పెట్టుకున్నప్పుడు కూడా అవి అందులోని సారాన్ని చప్పరించి మింగి పిప్పిని ఉమ్మేస్తాయి. ఈ పిప్పిని ఒకొక్కప్పుడు "అతిథులు" అరగించేస్తాయి.

పెద్దపెద్ద పుట్టలలో జీవించే చీమలు అనేక వేల సంఖ్యలో ఉంటాయి. అవి తమ ఆహారంకోసం రోజూ అనేక లక్షల కీటకాలను తెస్తాయుట.

ఎడారులలో ఉండే చీమలు ధాన్యపు గింజలను తెస్తాయి. వాటిని పిండి చెయ్యటానికిగాను ప్రత్యేకంగా పెద్దపెద్ద తలలు గల చీమలుంటాయి. ఇవి శ్రమపడి గింజలన్నిటినీ తమ పెద్ద నోళ్లలో పిండి పట్టి



పుట్టలో ఒకచోట పోగువేస్తాయి. గింజలు దొరికే తరుణం దాటిపోగానే మిగిలిన "శ్రామికులు" ఈ పెద్ద తలల చీమల కంఠాలు కత్తిరించేస్తాయి. ఇది ఆ చీమలకు తప్పు కాదు. ఎందుచేతనంటే, మళ్ళీ గింజలు దొరికేదాకా ఈ పెద్ద తలల చీమలకు పని లేదు. ఈ లోపుగా పెద్ద తలల చీమలు తయారుకానే అవుతాయి. అంతకాలమూ పాతవాటిని మేపటం వృథా!

సామాన్యంగా చీమల పుట్టల చుట్టూ కొంతమేర ఏమీ పెరగదు. అవతల చీమలకు పనికివచ్చే గింజలు కాసే మొక్కలుంటాయి. ఈ మొక్కలను చీమలు పని పెట్టుకుని నాటుతాయని కొందరి నమ్మకం. కాని ఇది నిజం కాకపోవచ్చు. తమ పుట్టలో మిగిలిపోయిన తప్పా, తాలూ తీసుకుపోయి పుట్టకు ఎడంగా చీమలు విడిచి వచ్చినప్పుడు అందులో ఒకటి రెండు గింజలుండి అవి వానలకు మొలకెత్తవచ్చు. ఏమైనా చీమల పుట్టల పరిసరాలలో వాటికి పనికి వచ్చే మొక్కలుండటం నిజం.

ఆహారం విషయంలో చీమలు ముందు జాగ్రత్త గలవి. వీటికి మంచి ఉదాహరణ "తేనె" చీమలు. (వీటిని గురించి ఇంకొకసారి తెలుసుకుందాం.) ఒకరకం చీమలు



తమకు కావలసిన పాచిని తామే పెంచుకుంటాయికూడా. ఈ చీమలు ఒక ప్రత్యేక జాతికి చెందినవి. అవి తినే ఆహారం పుట్టగొడుగులాటిపాచి. దాన్ని అవి తామే పెంచుకుంటాయి. ఇవి ప్రతి సాయంకాలమూ బయటికి వెళ్ళి ఆకుల ముక్కలను పట్టుకు వస్తాయి. ఒక్కొక్కసారి ఈ చీమలు చెట్లను చెట్లనే నిర్మూలించటంకూడా జరుగుతుంది. ఇలా తెచ్చిన ఆకులను చీమలు నమిలి లేహ్యంలాగా తయారు చేస్తాయి. దీనిపైన తాము తినే సూక్ష్మమైన పుట్టగొడుగులను నాటి, పెంచుతాయి. ఈ పంటను "ఎరువు" వేసి జాగ్రత్తగా పెంచి,

కాపాడే పని అంతా చిన్న చీమలు చూస్తాయి. ఈ చీమల జాతికి చెందిన "రాణి" పుట్టిల్లు వదిలి వచ్చేటప్పుడు తమకు ఆహార మైన "పాచి" నలుసులను (పుట్ట గొడుగులను) నోట కరచుకుని వస్తుంది. తాను తొలి చూలు పెట్టే గుడ్లను చితిపి వాటిపైన ఈ నలుసులను ఉంచి పెంచుతుంది. రెండవ విడత పిల్లలు పెరిగి పెద్దవయేసరికి వాటి ఆహారం పంట సిద్ధంగా ఉంటుంది.

### చెదలూ—చీమలూ

చెదలు చీమల జాతి కావని అదివరకే అనుకున్నాం. చీమలలోలాగ కాక చెదలలో ఆడ చెదలూ, మగ చెదలూ ఉంటాయి. వాటిలో "శ్రామికులు" ఒక రకమూ, "సిపాయిలు" ఇంకొక రకమూ ఉంటాయి. చెదల పుట్టలో "రాణి"తో బాటు "రాజు" కూడా ఉంటుంది.

చీమలలాగే చెదలుకూడా రకరకాల చోట్ల నివాసాలు ఏర్పరచుకుంటాయి. అవి పుట్టలు నిర్మిస్తాయి, చెట్లలో నివసిస్తాయి. అవి సాధారణంగా తినేది కొయ్యమాత్రమే. అయితే పాచి పెంచే చీమలలాగే కొన్ని చెదలుకూడా పాచిని పెంచుతాయి.

చెదలు చీకట్లో మాత్రమే జీవించగలవు. కొద్దిపాటి ఎండ తగిలితే అవి చచ్చిపోతాయి. మొత్తంమీద చీమలకంటె చెదలే ఎక్కువ నష్టం కలిగిస్తాయి. చీమలనుంచి మనం నేర్చుకోవలసినది ఎంతో ఉన్నది. వాటికి సాముదాయికంగా జీవించటం తెలుసు, రకరకాల ఇంటిపనులను అవి ఎంతో సమర్థతతో నిర్వర్తిస్తాయి, తమ రాణి పట్లా, దాని పిల్లలపట్లా ఎంతో శ్రద్ధాసక్తులు చూపుతాయి; తమ ఇంటిని కాపాడుకునేటందుకు ప్రాణాలు ఒడ్డి పోరాడతాయి; సమిష్టి క్షేమంకోసం ప్రతి ఒక్కటీ సాధ్యమైనంత కృషిచేస్తాయి. అందుచేత చీమల నుంచి మనం నెర్చుకోదగిన విషయాలు చాలా ఉన్నాయి.





# అహింసాజ్యోతి

## 12

ఇంటికి తిరిగి వస్తూ దారిలో జీవకుడు సాకేతునగరం చేరి అక్కడ కొంతకాలం విశ్రాంతి తీసుకున్నాడు. ఆ నగరంలో ఒక ప్రముఖుడి భార్య ఏడేళ్లుగా తీరని శిరోవేదనతో బాధ పడుతున్నది. ఎందరో వైద్యులు ఆమె బాధ నివారణ చేస్తామని నమ్మించి, ఎన్నో చికిత్సలు చేసి, ఎంతో డబ్బు గుంజారు, కాని వ్యాధిమాత్రం తగ్గలేదు.

జీవకుడికి ఈ వృత్తాంత మంతా తెలిసి, ఆ స్త్రీ ఉండే ఇంటికి వెళ్ళి, ఆమెకు చికిత్స చేయగలనని కబురుచేశాడు. అతడి వయసు గురించి తెలియగానే ఆమె, "కొమ్ములు తిరిగిన వైద్యులు కుదర్చలేని జబ్బును ఈ పసివాడు కుదుర్చుతాడా? అతను స్వయం పాకమే కోరతాడో, మరేదైనా కోరతాడో ఇచ్చి పంపెయ్యండి!" అన్నది.

ఈ మాటలు విని జీవకుడు, "జ్ఞానానికి బాల్యమేమిటి, వార్ధక్యమేమిటి? ముసలి వారందరూ తెలిసినవారౌతారా? ఆ ఇల్లాలికి నా చికిత్స ప్రధానంగాని, నా వయసుతో ఏం పని? ఆమె శిరోవేదన నయం చేసిగాని నేను వెళ్ళను. నా చికిత్స ఫలించకపోతే ఆమెకు కలిగే నష్టం ఏమీలేదు. ఎందుకంటే ఆమె వ్యాధి నయమైనాకగాని నేను ప్రతిఫలం పుచ్చుకోను," అని మళ్ళీ కబురు చేశాడు. ఈ మాటలు విని ఆ ఇల్లాలు ముచ్చటపడి జీవకుడికి కబురుపెట్టింది. అతను వచ్చినాక ఆమె అతన్ని చూచొమని,




"బాబూ, ఏడేళ్ళుగా నిద్రపోయి ఎరగను. కనీసం ఒక్క రోజుపాటు నాకీ తలబాధ లేకుండా చేయగలవా?" అన్నది.

"అమ్మా, మీ బాధను ఒక్క క్షణంలో పోగొడతాను. కొంచెం వెన్న కరగబెట్టండి," అన్నాడు జీవకుడు. కరిగించిన వెన్నలో ఏదో ఔషధం వేసి అతను దాన్ని ఆమె ముక్కులో పోశాడు. ఆ ఔషధంలో కొంత మెదడులోకీ, మరికొంత గొంతులోకీ వెళ్ళింది. గొంతులోకి వెళ్ళిన ఔషధాన్ని ఆమె బయటికి ఊసింది. వెంటనే ఆమె భర్త తన నౌకర్లతో, "ఆ మందును గుడ్డలోకి ఎత్తండి!" అన్నాడు.



"కింద పడిన మందునుకూడా తీసి భద్రంచేసే ఈ పిసినిగొట్టులు, నాకేమి ప్రతిఫలం ఇస్తారు?" అని జీవకుడు తనలో అనుకున్నాడు.

అతను మనసులో అనుకున్న మాట గ్రహించి ఆ ఇల్లాలు, "బాబూ, మరొక విధంగా భావించకు. ఆ మందును భద్రం చెయ్యమన్నది లోభంచేత గాదు, నీ మందుపై మాకు గల గౌరవంకొద్దీ అలా చేశాం. అది నిజంగా వెలలేని మందు. నా తలపోటు అప్పుడే పోయింది!" అన్నది.

ఈ మాట విని చుట్టూ చేరిన బంధువులూ, నౌకర్లూ పొందిన ఆనందానికి మేర లేదు. ఆ ఇల్లాలూ, ఆమె భర్తా, ఆమె కొడుకూ, బంధువులూ తలకొక నాలుగువేల నీలకర్షల చొప్పున జీవకుడికి బహుమతి ఇచ్చారు. అంతులేని రథాలూ, ఇతర బహుమానాలూ ఇచ్చారు.

వీటన్నిటినీ తీసుకుని జీవకుడు రాజగృహానికి వెళ్ళి, అభయుడితో, "నన్ను మీరు కష్టపడి పెంచి పెద్దచేసినందుకు ప్రతిఫలంగా ఇవన్నీ తీసుకోండి!" అంటూ తన తొలి సంపాదనను ఇవ్వబోయాడు.

అభయుడు ఆతనితో, "నాయనా, నువ్వు నాకూ సాలావతికీ పుట్టిన కుమారుడివని





నాకు ఈమధ్యనే తెలిసింది. నిన్ను పెంచి నందుకు నాకేమీ ప్రతిఫలం అవసరంలేదు. నువు నా ఆస్తికి వారసుడివై, నా భవనం చెంతనే ఒక భవనం కట్టుకుని వుండ వలసింది," అన్నాడు.

కొంతకాలానికి బింబిసార మహారాజుకు ఒక వ్రణం కలిగింది. ఎందరు ఎన్ని చికిత్సలు చేసినా అది మానలేదు. ఈ సంగతి తెలిసి అభయుడు తన తండ్రితో, "నా కొడుకు మంచి వైద్యుడు, వాడిచేత చికిత్స పొందరాదా ?" అన్నాడు. బింబిసారుడు జీవకుణ్ణి ఏకాంతంగా తన గదికి పిలిపించి తన వ్రణం సంగతిచెప్పాడు. జీవకుడు తన గోరుతో కొంచెం లేపం తీసుకుని దానిని తన తాతగారి వ్రణంపైన పూశాడు. వెంటనే మహారాజుకు బాధ నివారణ అయింది, వ్రణం అణిగిపోయింది.

ఈ అద్భుత చికిత్సను బింబిసార మహారాజు నమ్మలేకపోయాడు. ఇలాటి విద్య చేతిలో గల జీవకుడు సజ్జనుడైతే దేశానికి ఎంత క్షేమమో, దుర్జనుడైతే అంత అపాయం. అతను సజ్జనుడో, దుర్జనుడో తేల్చుకోవాలనుకున్నాడు మహారాజు. అతనిని పరీక్షకు పెట్టేటందుకుగాను ఆయన తన అయిదువందలమంది రాణులనూ



పిలిచి, వారి సమక్షంలో జీవకుడు చేసిన అద్భుత చికిత్సను ప్రశంసించి, "ఇతనిని తగిన విధంగా సత్కరించండి!" అన్నాడు. వారు మేలి వస్త్రాలు బోలెడన్ని తెచ్చి జీవకుడికి సమర్పించారు. ఈ కట్నాలు చూసి అభయుడు మొదలైనవారికి కళ్లు కుట్టాయి. జీవకుడు వాటిని స్వీకరిస్తాడేమోనని వారు భయపడ్డారు.

అయితే జీవకుడు వివేకంలో ఒకరికి తీసిపోయేవాడు కాడు. అతను రాణులతో, "రాజోచితమైన ఈ వస్త్రాలు నాకెందుకు? నేను సామాన్య పౌరుణ్ణి. నన్ను మీ అండన క్షేమంగా బతకనివ్వండి, అదే నాకు పది



వేలు!" అన్నాడు. ఈ మాట విని మహారాజూ, రాణులూ చాలా సంతోషించారు. మహారాజు అతనికి అనేక తోటలూ, గ్రామాలూ రాసిఇచ్చి వాటిమీద వచ్చే ఫలాన్ని అనుభవించమన్నాడు. అది మొదలు జీవకుడు మహారాజు మిత్ర వర్గంలో చేరాడు.

రాజగృహంలోనే ఒక ధనవంతుడైన కులీనుడికి తలపోటు వచ్చింది. ఇద్దరు వైద్యులు అయనను పరీక్షించి చూసి, ఆ వ్యాధికి చికిత్సలేదనీ, త్వరలోనే ఆ కులీనుడికి మరణంకూడా రానున్నదనీ చెప్పారు. వారిలో ఒకడు వారంరోజులకు మరణం సంభవిస్తుందన్నాడు, రెండవవాడు అయిదు రోజులే గడువిచ్చాడు.

ఆ కులీనుడు రాజగృహానికి ఆయువు పట్టులాటివాడు కావటంచేత ఆయన వ్యాధినిగురించి బింబిసార మహారాజు చాలా చింతించాడు. ఆయన జీవకుణ్ణి పిలిచి, ఆ కులీనుడికి చికిత్స చెయ్యటానికి ప్రయత్నించమన్నాడు. జీవకుడు వెళ్ళి రోగిని పరీక్షించి, "ఈ రోగి శిరస్సులో రెండు పురుగులున్నాయి. ఒకటి పెద్దది, రెండవది చిన్నది. పెద్దది అయిదు రోజులలో చంపుతుంది, చిన్నది వారంరోజులలో చంపుతుంది. ఈ రోగిని లోగడ పరీక్షించిన





వైద్యులు ఒక్కొక్క పురుగును మాత్రమే కనిపెట్టగలిగారు. అయినా భయంలేదు. నేను ఈ వ్యాధిని కుదుర్చుతాను. అయితే అందుకు రెండు షరతులున్నాయి. ఒకటి ఏమిటంటే, నేను ఎంత బాధ కలిగించినా సహించాలి. గురువు విద్యార్థి క్షేమం కోరి శిక్షించిన విధంగా, నేను మీ ఆరోగ్యం కోస రమే బాధ కలిగిస్తాను. దాన్ని భరించటం వల్ల చివరకు మేలే కలుగుతుంది. ఇక రెండవ విషయమేమంటే, చికిత్స ముగిసినాక ఇరవై ఒక్క నెలలపాటు కదలకుండా పడుకోవాలి. ఈ రెండూ సమ్మతమైతే నేను చికిత్స చేస్తాను," అన్నాడు.

ప్రాణభయంతో కొట్టుకుపోతున్న కులీనుడు వెంటనే అన్నిటికీ సమ్మతించాడు. జీవకుడు రోగిని మేడమీది గదికి చేర్చి, అక్కడ ఒక పదునైన శస్త్రంతో రోగి తలపై గల ఎముకలను కోసి, లోపలినుంచి రెండు పురుగులను పైకి తీసి, తిరిగి తలఎముకలు యథాస్థానంలో ఉంచి కుట్టేశాడు.

ఈ శస్త్రచికిత్సలో ఉండే అద్భుతమైన విషయమేమంటే చికిత్స పూర్తి అయినాక వైద్యుడు తలను ఎక్కడ కోసి కుట్టినదీ ఎవరికీ తెలియరాలేదు. రోగికి బాధ యాపత్తూ నివారణ అయింది. "ఇరవై ఒక్క నెలలు కదలకుండా పడుకోవాలన్నానుగాని, ఇరవై





ఒక్క రోజు పడుకుంటే చాలు!" అని జీవకుడు కులీనుడికి చెప్పాడు.

కులీనుడు జీవకుడికి అంతులేని ధనం బహూకరించబోయాడు. కాని జీవకుడు దాన్ని స్వీకరించక, రాజుగారివద్ద ఒక లక్ష, సంపన్నుడివద్ద మరొక లక్ష, చిల్లర బహుమానాలూ మాత్రమే స్వీకరించాడు. జీవకుడి ఖ్యాతి జంబూద్వీపమంతటా పాకింది.

కాశీనగరంలో ఒక కులీనుడుండేవాడు. అయన చిన్నతనంలో దూకుతుండగా పేగు ముడి పడిపోయింది. అదిమొదలు ఆయన మామూలుగా భోజనం చెయ్యలేక, మల విసర్జన చేయలేక, పలచని ఆహారంతో



ప్రాణం కాపాడుకుంటూ, క్రమంగా చిక్కి ఎముకల పోగై పోయాడు. అయనకు చికిత్స చేస్తామంటూ ఎక్కడెక్కడినుంచో వైద్యులు వచ్చి, అయనను పరీక్షించి, తమవల్ల కాదని తల అడ్డంగా తిప్పి వెళ్ళిపోసాగారు.

రోగి తండ్రి జీవకుడి పేరు ప్రతిష్ఠలను గురించి విన్నవాడై, మంచిమంచి కానుకలు తీసుకుని రాజగృహానికి వెళ్ళి, బింబిసార మహారాజు దర్శనం చేసుకుని, "మహారాజా, నా కుమారుడికి చికిత్స చేయటానికి జీవకుణ్ణి పంపండి!" అని వేడుకున్నాడు.

బింబిసారుడి కోరికపై జీవకుడు కాశీకి ప్రయాణమై వెళ్ళి రోగిని చూశాడు. "ఈ వ్యాధి దూకేటప్పుడుగాని, భారీగా శ్రమ చేసేటప్పుడుగాని వచ్చిందా? పేగుల్లో ఉండ చుట్టుకున్నట్టుగా ఏమైనా ఉంటుందా?" అని జీవకుడు రోగిని అడిగాడు. రోగి రెంటికీ ఔనన్నాడు.

జీవకుడు అందరినీ గదిలోనుంచి బయటికి పంపేసి, రోగిని ఒక స్థంభానికి గట్టిగా అంటగట్టి, అతని ముఖాన్ని కప్పి, పదునైన శస్త్రంతో రోగి పొత్తికడుపు కోసి, పేగు పైకి లాగి సరిచేసి, మళ్ళీ లోపల పెట్టేసి కుట్టి, పైన ఏదో లేహం పూసి, తరవాత రోగిని స్థంభంనుంచి విప్పి జావ పథ్యం పెట్టిం



చాడు. మూడో రోజుకల్లా రోగి మామూలు మనిషిలాగా లేచి తిరగసాగాడు.

ఈ చికిత్స చేసినందుకు జీవకుడికి 16 వేల మసురణాలు కట్నంగానూ, అంతులేని గుర్రాలూ, రథాలూ, గోవులూ, దాస దాసీలూ కానుకలుగానూ లభించాయి. వాటన్నిటినీ వెంటబెట్టుకుని వైభవంగా ఊరేగుతూ జీవకుడు రాజగృహానికి తిరిగి వచ్చాడు. అటుతరవాత నానా దేశాలనుంచి జనం వచ్చి జీవకుడి చికిత్సలకోసం ఎగబడ సాగారు.

ఆ కాలంలో ఉజ్జయినికి రాజు చండప్రద్యోతుడు. ఆయనకు పచ్చకామెర్ల వ్యాధి కలిగింది. ఆయన బింబిసార మహారాజుకు కానుకలు పంపి తనకు చికిత్స చేయటానికి గాను జీవకుణ్ణి పంపమని కబురుచేశాడు. కాని బింబిసారుడు ఎన్నిసార్లు హెచ్చరించినా జీవకుడు బయలుదేరలేదు.

దీనికి కారణం ఉన్నది. ఉజ్జయిని రాజుకు చికిత్స చెయ్యాలంటే నూనె వాడకుండా చికిత్స సాధ్యంకాదు. కాని ఆ రాజుకు ఏ రూపంలోనూ నూనె అంటే పడదు. భోజనంలో నూనె తగలరాదు, శరీరానికి తగలరాదు, ఆఖరుకు చమురు దీపాలను కూడా ఆ రాజు భరించలేడు. అందుచేత జీవకుడు ఆయనకు చికిత్స చేయ



దలచలేదు. కాని ఉజ్జయిని రాజు బింబిసార మహారాజుకు కట్నాలమీద కట్నాలు పంపి, కబురుమీద కబురు చేయసాగాడు. బింబిసారుణ్ణి కాదనలేక చిట్టచివరకు జీవకుడు ఉజ్జయినికి బయలుదేరి వెళ్ళాడు. రాజుకు తెలియకుండా చికిత్స చేయటానికి అతను నిశ్చయించుకున్నాడు. తానిచ్చే ఔషధం ఏమిటో తెలిస్తే అందువల్ల రోగికీ, తనకూ కూడా అపాయం ఉన్నది.

"మహారాజా, నేను తమకు చికిత్స చేస్తాను. కాని నేనిచ్చే ఔషధం ఏమిటో చెప్పను. నేను మూలికలు వెతకటానికి స్వేచ్ఛగా ఊరి బయటికి వెళ్లివచ్చే సదుపాయాలు చేయించాలి. అలా అయితేనే చికిత్స చేస్తాను!" అని జీవకుడు రాజుతో అన్నాడు

రాజుగారికి నాలుగు రకాల వాహనాలు—బోయీలు మోసే పల్లకీ, ఒక ఏనుగూ, ఒక కంచరగాడిదా, ఒక గుర్రమూ—ఉన్నాయి. వీటిలో దేనినైనా జీవకుడు యథేచ్ఛగా ఉపయోగించ వచ్చునని రాజుగారు ఉత్తరువిచ్చారు. జీవకుడు వాటన్నిటిలోనూ యథేచ్ఛగా తిరిగి మూలికలు పోగుచేసుకువచ్చాడు. ఆ మూలికలను నూనెలో కాచి ఔషధం తయారుచేశాడు. రాజుగారివద్దకు వెళ్ళి, "మహారాజా, ఔషధం తయారయింది. జాగుచేస్తే దాని ఘాటు కాస్తా పోతుంది. దాన్ని మీరు రుచిచూస్తూ కూచునే వ్యవధి లేదు. వెంటనే గొంతులో పోసేసుకోవాలి!" అన్నాడు.

రాజు సరేనని ఒకచేత ముక్కు మూసుకుని రెండోచేత మందు తీసుకుని నోట్లో పోసేసుకున్నాడు.

ఆ క్షణంలోనే జీవకుడు ఎవరితోనూ చెప్పకుండా నేరుగా ఏనుగుల సాలకు వెళ్లి, భద్రవతి అనే తన ఏనుగునెక్కి అతివేగంగా బయలుదేరాడు. వాయువేగంతో అతను కౌశాంబీ నగరానికి వచ్చి చేరి అక్కడ విశ్రాంతి తీసుకున్నాడు. —(ఇంకా వుంది)



# 1. తాజ్ మహల్

తాజ్ మహల్ మన దేశపు అద్భుతాలలో అగ్ర గణ్యమైనది మాత్రమే గాక ఈ కాలపు ప్రపంచాద్భుతాలలో ఒకటిగా ఎంచబడుతున్నది.

అక్బరు కాలంలో మొగలు చక్రవర్తుల రాజ నివాసం ఢిల్లీనుంచి ఆగ్రాకు మారింది. అటుతరవాత అక్బరు మనుమడైన షాజహాఁ భార్య ముంతాజ్ మహల్ 1631 లో చనిపోతూ, తన ఆఖరు కోరికగా భర్తను తిరిగి పెళ్ళాడవద్దనీ, తన పేరు చిరస్థాయిగా ఉండే కార్యం ఏదైనా చేయమనీ కోరింది. షాజహాఁ ఈ రెండు కోరికలూ చెల్లించాడు. ఆయన తిరిగి పెళ్ళాడలేదు, తన భార్యకు స్మారక చిహ్నంగా అపూర్వమైన తాజ్‌మహల్ కట్టడాన్ని నిర్మించాడు.

దీని నిర్మాణంగురించి ఒక ప్రాచీన పర్షియను గ్రంథంలో ఒక పుక్కిటికథ ఉన్నది. తాను తలపెట్టిన కట్టడానికి పథకం తయారుచేయగలవాడి కోసం ఆయన దేశమంతటా ఘాలించాడట. చివరకు ఆయనకు ఒక వృద్ధ తపస్వి దొరికాడట. ఆయన సూచనపై ఒక శిల్పిచేత ఏదో మూలిక తినిపించారు. దాన్ని తిన్న శిల్పి తాజ్ మహల్ పథకం తయారుచేసి స్పృహతప్పి పడిపోయాడట.

ఏమైనప్పటికీ తాజ్ మహల్ నిర్మాణం 22 ఏళ్లు సాగింది. అసంఖ్యాకులైన పనివాళ్లు దాన్ని నిర్మించారు. దాని నిర్మాణానికి 3 కోట్ల రూపాయలు వ్యయమయింది. 1653 నాటికి అది పూర్తి అయింది. 1666 లో షాజహాఁ కూడా చనిపోయాడు. ఆయననుకూడా తాజ్ మహల్‌లోనే, భార్యపక్కన సమాధిచేశారు.

తాజ్ మహల్ తెల్లని పాలరాతితో కట్టినది. దాని నిడివి 130 అడుగులు, ఎత్తు సుమారు 200 అడుగులు. జమునానది ఒడ్డున ఉన్న ఈ కట్టడం చుట్టూ అందమైన సైప్రెస్ తోటలున్నాయి. వెన్నెలలో చూస్తే ఈ కట్టడం అతిలోక రమణీయంగా ఉంటుంది.






# అనుకూలవతి అయిన భార్య

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. ఆయన భార్యకు తన భర్తపైన ఎంతో గురి. ఆయన ఏమి చేసినా ఆమెకు గొప్పగానే ఉండేది. వారికి తగినంత పొలం ఉన్నది, రెండు ఆవులున్నాయి. అందుచేత వారు పాడిపంటలకు లోటు లేకుండా సుఖంగా కాపరం చేస్తున్నారు. రైతుభార్య ఒక వంద రూపాయలు కూడబెట్టిందికూడాను.

ఆమె ఒకనాడు తన భర్తతో, "మనకు ఒక ఆవు పాడి సరిపోతుంది. గొడ్డుకు గొడ్డంత చాకిరీ చెయ్యాలిగద. అందుచేత ఒక ఆవును తీసుకుపోయి అమ్ముకురండి. నిలవ ఉంచిన నూరు రూపాయలూ అంటు కోకుండా పండగలకూ, పబ్బాలకూ ఖర్చు చేసుకునేటందుకు డబ్బు చేతిలో ఆడు తుంది," అన్నది.

రైతు సరేనని ఒకనాడు తన ఆవులలో ఒకదాన్ని వెంటతీసుకుని బస్తీకి వెళ్ళాడు. ఎంత ప్రయత్నించినా ఆవు అమ్ముడు పోలేదు. "అమ్మకపోతే మునిగిందేమిటి? మన సొత్తు మనకే ఉంటుంది!" అనుకుని రైతు ఆవును తీసుకుని ఇంటిదారి పట్టాడు.

దారిలో ఆయనకు ఒక మనిషి గుర్రాన్ని తెస్తూ ఎదురైనాడు. రైతు ఆ మనిషికి తన ఆవునిచ్చి అతడి గుర్రాన్ని తీసుకుని ముందుకు సాగాడు.

కొంతదూరం వెళ్ళేసరికి ఆయనకు ఒక మనిషి మేకను తోలుకుంటూ ఎదురు వచ్చాడు. రైతు ఆ మనిషికి గుర్రాన్నిచ్చి మేకను తీసుకున్నాడు.

ఇంకా కొంతదూరం వెళ్లేసరికి రైతుకు ఒక మనిషి ఒక బాతుతో ఎదురుపడ్డాడు. రైతు ఆ మనిషికి మేకనిచ్చి బాతును తీసుకున్నాడు.

మరికొంత దూరం వెళ్లేసరికి ఒక మనిషి కోడిపుంజుతో ఎదురుపడ్డాడు. రైతు

ఎ. శ్యామలాంబ

తనదగ్గిరవున్న బాతును కోడిపుంజుతో మారకంవేశాడు.

రైతు వెళ్లవలసిన దూరం చాలా ఉన్నది. ఆయనకు ఆకలి దహించుకుపోతున్నది. అందుచేత ఆయన దారిలో ఒక ఇంటివాళ్లకు ఆ కోడిపుంజు నిచ్చి కడుపునిండా అన్నంతిని ఖాళీచేతులతో తన గ్రామానికి చేరుకున్నాడు.

రైతుకు పొరుగింటివాడొకడు కనిపించి, "బస్తీకి వెళ్ళావుట, మంచి బేరం చేసుకొచ్చావా?" అని అడిగాడు.

రైతు పొరుగింటివాడితో జరిగినదంతా చెప్పి, "నేను చేసింది పొరపాటంటావా?" అని అడిగాడు.

"పొరపాటా, పొరపాటున్నరా? నువు చేసిన పని చూసి మీ ఆవిడ ఎంత పోట్లాట పోట్లాడుతుందో చూడు!" అన్నాడు పొరుగింటివాడు.

"మా ఆవిడ పోట్లాడే రకం కాదులే!" అన్నాడు రైతు.

"ఎంత అమాయకురాలైనా ఇవాళ నువు చేసిన పనికి తప్పక ఇంటికప్పు ఎగరగొట్టేస్తుంది!" అన్నాడు పొరుగింటివాడు.

ఇద్దరూ పందాలు ఒడ్డుకున్నారు.

"నా దగ్గిర నూరు రూపాయలు నిలవ ఉన్నాయి. మా ఆవిడ నన్నుతప్పు పట్టదని




ఆ నూరు రూపాయలూ ఒడ్డుతాను. నువో?" అని రైతు అడిగాడు.

"నీతో పోట్లాడుతుందని నేనూ నూరు రూపాయలు ఒడ్డుతాను," అన్నాడు పొరుగింటివాడు.

"అయితే నువు నావెంట వచ్చి బయటి అరుగుమీద కూచుని మా సంభాషణ ఆలకించు!" అంటూ రైతు పొరుగింటివాణ్ణి తమ వీధి అరుగుమీద కూచోబెట్టి తాను లోపలికి వెళ్ళాడు.

"ఏమండీ, వచ్చారా? ఆవు అమ్మడయిందా? ఎంతధరకు అమ్మారేమిటి?" అన్నది రైతు భార్య.

"ఎవరూ కొనలేదు. అందుకని దాన్ని ఇచ్చి ఒక గుర్రాన్ని తీసుకున్నాను," అన్నాడు రైతు.

"మంచిపని చేశారు. ఒక బండీ కొన్నామంటే మనం ఎక్కడికైనా సుఖంగా వెళ్ల వచ్చు!" అన్నది భార్య.

"గుర్రాన్ని తేలేదు. దాన్ని మార్చి ఒక మేకను తీసుకున్నాను," అన్నాడు రైతు.

"అదే మంచిది. గుర్రాన్ని మేపలేం, బాబూ. మేకను కానీ ఖర్చు లేకుండా మేప వచ్చు. ఏదీ మేకా?" అన్నది భార్య.

"కొంచెం ఆగు. మేకను మార్చి బాతును తీసుకున్నాను," అన్నాడు రైతు.

"భేషైన పని చేశారు. మేకవెంట తిరగ లేక చావాలి!" అన్నది భార్య.

"ఆ బాతును మార్చి కోడుపుంజు తీసుకున్నాను," అన్నాడు రైతు.

"కోడిపుంజయితే ఇంకా బాగుండేదే అని అందామనుకుంటున్నాను. పుంజే నయం చక్కగా పొద్దున్నే లేపుతుంది," అన్నది రైతు భార్య సంతోషంతో.

"అయితే ఏంజరిగిందంటే దారిలో ఆకలి మండిపోయింది. అందుకని ఆ పుంజును ఒకళ్ల కిచ్చి వారింట ఇంత భోజనం చేసి చక్కావచ్చాను," అన్నాడు రైతు.

"మంచిపని చేశారు! వెధవపుంజు, ప్రాణంకంటె ఎక్కువా ఏమిటి?" అన్నది రైతు భార్య.

రైతు బయటికి వచ్చి, తనతో పందెం వేసిన పొరుగింటివాడితో, "విన్నావుగా మా సంభాషణ?" అన్నాడు.

"విన్నాను, విన్నాను! మా ఇంటికివచ్చి నువు గెలుచుకున్న నూరు రూపాయలూ పట్టుకుపో!" అన్నాడు పొరుగింటివాడు అరుగు మీదినుంచి కిందికి దిగుతూ.

భార్య అనుకూలవతి కావడంచేత రైతు ఈ విధంగా అవు ఖరీదుకు రెట్టింపు సంపాదించుకున్నాడు.






## 1. జ్ఞానాన్వేషి

వన్యమృగాలతో జీవించేవాడు అనేకమైన విచిత్ర సన్నివేశాలలో చిక్కుకుంటాడు. కొన్ని సరదాగా ఉంటాయి, కొన్ని ఉద్వేగకరంగా ఉంటాయి; కొన్ని కరుణామయంగానూ, కొన్ని క్రూరంగానూ ఉంటాయి; హెచ్చుభాగం అపాయకరంగా ఉంటాయి. అలాటి జీవితం గడిపేవాడికి అందులో ఆసక్తి ఉండాలి. నాకు ఆ జీవితం ఎంతో తృప్తికరంగా ఉంటుంది. నన్ను అడపాదడపా వన్యమృగాలు తీవ్రంగా పీకటం జరిగింది. అయితే, నిజం చెప్పాలంటే, ప్రతిసారి కూడా పొరపాటు నాదే.

నాకు కలిగిన మొదటి పెద్ద ప్రమాదం ఈ విధంగా జరిగింది: నేను అప్పుడే సర్కసు అలవలోకి అడుగు పెట్టాను. నేనింకా ఏమీ చెయ్యకముందే ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు. నేను వారి అభినందనలు స్వీకరించటంలో నిమగ్నుడనైపోయి జంతువులను ఒక కంట కనిపెట్టి ఉండాలన్నది మరిచాను. తొందరపడి బోనుల మనిషి ఆరు సింహాలను అలవలోకి వదిలాడు. నేను వాటిని గమనించలేదు.

వాటిలో నాలుగేళ్ల వయస్సుగల సింహం ఒకటి ఆకతాయితనంగా నా తొడను పంజాతో పట్టి చీల్చేసింది. అది క్రౌర్యంతో చేసిన పని కాదు; అయినా నేను ఆస్పత్రి చేరక తప్పిందికాదు.

నా గురువుగారు, కార్ల్ హాఫ్మన్, ఆస్పత్రిలో నన్ను చూడవచ్చారు. ఆయన నా పక్కమీద కూచుని, కుశలప్రశ్నలు అయాక, "మొత్తానికి అనుభవం లేనివాడిలాగా ప్రవర్తించావు. ఇంకా నయం, నిన్నవి ఫలహారం చేసి ఉండవలిసింది. వాటి దెబ్బ తినటం నీకిది మొదటిసారే కదూ? ఇంత

టితో అయిపోయిందనుకోకు. ఇలా చాలా సార్లు జరుగుతుంది!" అన్నారు.

గాయం నయమవుతూనే నేను కార్ల్ హాఫ్‌మన్ వద్దకు వెళ్లి, "ఇవాళ సాయంకాలంనుంచీ మళ్లీ పనిలోకి వస్తాను," అని చెప్పాను.

ఆయన చిరునవ్వు నవ్వి నన్ను భుజంపై తట్టుతూ, "నువు ఎలా రూపొందుతావా అని చూస్తున్నాను, జిమ్. మనిషిలో నిజమైన సత్తా ఉన్నదీ లేనిదీ మొదటి ప్రమాదం జరిగినాకనే బయట పడుతుంది. తిరిగి జంతువుల మధ్యకు వెళ్లకుండా ఉండటానికి రకరకాల సాకులు చెప్పేవాడు పనికి వచ్చేవాడుకాడు. అలాటివాడు జంతువులకు ఎడంగా ఉండటమే మంచిది. మళ్లీ పనిలోకి రావాలని ఉబలాటపడేవాడికే ఏమైనా భవిష్యత్తు ఉంటుంది," అన్నారు.

* * *

నా మొదటి ప్రమాదానికి కారణం నా అలక్ష్యమే. ఈ అనుభవంతో నేను అణకువ నేర్చుకున్నాను. వన్యమృగాలచేత ఆడించేవాడు ప్రేక్షకుల ఎదట వంగటమూ, చిరునవ్వు నవ్వటమూ మాత్రమే చేస్తే చాలదని నాకా సింహం బుద్ధిచెప్పింది. ఇలాటి గుణపాఠాలు ఇంకా ఎన్నో నేర్చుకుని వాటిద్వారా నాలోని లోపాలు సవరించుకున్నాను.



అసలు సంగతేమంటే నేను రెండేళ్లుగా వన్యమృగాలను మచ్చిక చేసేవాడినని చెప్పుకుంటున్నప్పటికీ నేను వ్యవహరించి నది మచ్చిక అయిన జంతువులతోనూ, మచ్చిక అవుతున్న వాటితోనూ మాత్రమే.

నేను అలవలోకి అడుగు పెడుతూనే ఏ జంతువు మనోవైఖరి ఎలా ఉన్నదీ ఇంచు మించుగా అంచనా వేయగలిగేవాణ్ణి. నాకా జంతువులను గురించి తెలిసినదంతా నాకు గురువులు చెప్పినదీ, నేను స్వయంగా గమ నించి కొద్దిగా తెలుసుకున్నదీనూ. ఆ జంతు వుల వాస్తవ స్వభావాలను గురించి నాకేమీ తెలియదు.

ఆ జంతువులు నా అదుపులో ఉంటున్న వనేది కొంతకాలంగా గమనించాను. అవి నేను చెప్పినట్టు చేస్తున్నాయి. మచ్చిక అయి మానవుల సంపర్కం పొందినందువల్ల వాటి స్వభావాలు మారిపోయి అవి "నాగరిక" జంతువులు అయాయా అని నేను అనుకు న్నాను కూడా.

ఒక్కొక్కసారి, నేను ఆ జంతువులకు లేని గుణాలు ఊహించుకుంటున్నానా అని సందేహం కలిగేది. ఎందుకంటే వాటి యందు నాకు ఆసక్తి, వాటిపైన అభిమా నమూ ఉన్నది. ఆ కారణంగా వాటిలో లేని సద్గుణాలను నేను ఊహించి ఉండవచ్చు.



ఈ అనుమానం అంతకంతకూ బలపడింది. ఈ జంతువులను వాటి సహజ వాతావరణంలో—అరణ్యంలో—పరిచయం చేసుకోవటం మంచిదని తోచింది. అంతదాకా వాటి వాస్తవ స్వభావం నాకు తెలియదు, వాటిని నేను పూర్తిగా అర్థంచేసుకుని వాటితో సామరస్యం సాధించలేను.

వన్యమృగాలతో సామరస్యం ఏమిటని కొందరు అనుకోవచ్చు. సాధారణంగా మామూలు మనుషులు వన్యమృగాలను సర్కసులో మాత్రమే చూస్తారు; లేదా పిల్లలను అడలగొట్టటానికి వాటిని ప్రస్తావించుతారు. చిన్న పిల్లల పుస్తకాలలో సింహాలూ, పులులూ, ఎలుగుబంట్లూ, ఏనుగులూ, కోతులూ మొదలైన వాటి స్వభావాలు వక్రంగా చిత్రించి ఉంటాయి. జంతువుల స్వభావాలను అసత్యంగా చిత్రించటం చూసి జంతువులను మచ్చికచేసేవాళ్లు సహించలేరు.

నాలాటివాళ్లం ఆ వన్యమృగాల కంటె మేము ఎక్కువైనవాళ్లమని ఎన్నడూ చెప్పుకోము—ఇది చూసి మీరు ఆశ్చర్యపడవద్దు. జంతువులను తక్కువ ప్రాణులని ఎవరైనా అంటే నాకు మండిపోతుంది.

మనుషుల ఆధిక్యత ఎందులో ఉన్నదో నాకు బోధపడదు. మన జీవిత విధానాలు వాటి జీవిత విధానాలకంటె మెరుగని కూడా నేను ఒప్పుకోను. జంతువులకు తెలియని విషయాలు మనకు చాలా తెలుసు, నిజమే, కాని మనకు తెలియని విషయాలు వాటికి ఎన్నో తెలుసు.

నాకు వన్యమృగాలను గురించి తెలుసుకోవాలని కోరిక పుట్టింది. అందుకని నేను "పోటొమాక్-3" అనే స్టీమరులో ప్రయాణమై, ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికాతీరాన వన్యమృగాల వ్యాపారంలో ప్రవేశించాను. నా మొట్టమొదటి అనుభవం సింహాలతో.

—(పై సంచికలో "మృగరాజు")



కుక్కల కథలు:

# 2. వైమానికుడి కుక్క

గత యుద్ధమప్పుడు అమెరికాలోని బ్రూక్లిన్ నివాసి ఒక అతను యుద్ధ వైమానికుడుగా పనిచేశాడు. ఆయనవద్ద ఒక పెంపుడుకుక్క ఉండేది. అది "కాకర్ స్పానియల్" అనే జాతికి చెందినది. ఎర్రగా ఉండేది. 1944 నాటికి దాని వయసు రెండున్నర సంవత్సరాలు. దాని పేరు "పిస్టల్ హెడ్."

"పిస్టల్ హెడ్" యజమాని యాభై బాంబరు దాడులలో పాల్గొని శత్రువులపై బాంబులువేసి వచ్చాడు. ఇందులో 48 సార్లు "పిస్టల్ హెడ్" అతనివెంట వెళ్లి దాడులలో పాల్గొన్నది. ఈ అనుభవంతో అది శత్రు విమానాలను వాటి ధ్వనినిబట్టి తెలుసుకోవటం నేర్చుకున్నది. విమానంలో ఉన్న వాళ్లుగాని, భూమిపైన స్థావరాలలో ఉన్న వాళ్లుగాని అలికిడినిబట్టి దూరాన ఉన్నవి శత్రు విమానాలని తెలుసుకునే లోపునే "పిస్టల్ హెడ్" తెలుసుకునేది.

దూరానవున్న విమానాల ఇంజన్ల మోతను బట్టి అది అవి శత్రువిమానాలైనదీ, అమెరికను విమానాలైనదీ తెలుసుకుని, శత్రు విమానాలైతే ఒక రకంగానూ, మిత్ర విమానాలైతే మరొక రకంగానూ మొరిగేది. దానికి గల శక్తిని వైమానిక శాఖకు చెందినవారు కథలుగా చెప్పుకోసాగారు.

ఇలా ఉండగా "పిస్టల్ హెడ్" యజమాని తన 51 వ విమానదాడిపై బయలుదేరాడు. అతను ఆ దాడికి బలి అయిపోయాడు.

తన యజమాని పోయాక "పిస్టల్ హెడ్" తిండి మానేసి దిగులుపడి శుష్కించసాగింది. దానిని విమాన శాఖవారు మార్షల్ దీవులనుంచి బ్రూక్లిన్‌కు చేర్చారు. అది తన యజమాని భార్యనూ, ఏడాది వయసు గల కొడుకునూ కలుసుకున్నాక మళ్లీ సంతోషంతో అరవగలిగింది.






1. *డి. పుల్లయ్యశర్మ, వేములవాడ*

**"చందమామ" ఇంత బాగుగ పైకి రావడానికి కారణం?**

మీకూ మాకూ మధ్య ఉండే పరస్పర ఆదరాభిమానాలు.

2. *వి. ఆర్. శేఖర్, చేబ్రోలు*

**దాసూ, వాసూలవద్ద ఉండే "టైగర్" ను నేను కొనదలిచాను....ఏ విషయం తెలియపరచండి.**

"టైగర్" దాసూ, వాసూలను వదిలిపెట్టి ఇంకొకరివద్దకు రాదు. అందుచేత ఆ ఆలోచన మానుకుంటే మంచిది.

3. *దరిశి శ్రీరాములు, ముండ్లపాడు*

**చందమామ అన్నయ్యా! నేను 1945 సంవత్సరంనుంచి "చందమామ" ను అభిలాషతో చదువుచున్నాను. అయితే మీరు నాకు ఇచ్చు బహుమతి ఎంత?**

"చందమామ" 1947 లో వెలువడింది. అందుచేత రెండేళ్ళపాటు మాకు తెలియకుండా చదివినందుకు నీవే మాకు రెండేళ్ళ చందా పంపు, తమ్ముడూ!

4. *ధారా భాస్కర్, విజయనగరము*

**అన్నయ్యా, రాకెట్ అంటే ఏమిటి?**

తారాజువ్వలు రాకెట్లే. రాకెట్‌లో ఒక అరలో ఇంధనం ఉంటుంది. అది వాయురూపంలోకి మారి ఒక సన్నని రంధ్రంగుండా అతి వేగంగా వెలువడుతుంది. ఇంధన వాయువులు వెనక్కు పోయే వేగాన్నిబట్టి రాకెట్ ముందుకు పోతుంది. జెట్ విమానాలుకూడా ఇదే సూత్రంపైన నడుస్తాయి.

5. *జార్జ్ డేవిడ్, సికిందరాబాద్*

**నేను "చందమామ" చదువుచుండగ అమ్మ ఏదో పని పెట్టి ఆ పని చేయకుంటే నన్ను కొట్టి "చందమామ" ను చింపి పారవేయును. నన్ను ఏమి చేయమంటారు?**

పెద్దల మాట వినకపోతే ఎంత నష్టమో చూశావా, జార్జీ!

6. *వేల్పూరి ప్రభాకర్, పల్లిపట్టు*

**చందమామలోని "కంచుకోట" స్వాధీనానంతరము "చందమామ" నెవ రాశ్రయిస్తారు?**

"జ్వాలాద్వీపం" లోని అద్భుతాలు ఆశ్రయిస్తాయి. ఈ సంచిక 70 వ పేజీ చూడు.

7. *ఎమ్. రంగారావు పట్నాయక్, వేణమ్మపేట*

**మామా! మహాభారతం ప్రచురణ చాలా బాగుంది. అది పుస్తకంగా ప్రచురిస్తే చాలా బాగుంటుందని నా ఉద్దేశం.**

"చందమామ" లో ప్రచురణ అయినాకనే పుస్తకంగా వెలువడేది.

8. 10658 (!), *చెక్కుచెర్ల*

**చంద్రమండలమునకు 1 సంవత్సరమునకు లోపల మానవుల రాకపోకలు జరుగగలవని 'ఆంధ్రప్రభ'లో చదివాను. అట్లు జరుగదని నా అభిప్రాయము. మీ అభిప్రాయము సెలవిచ్చెదరా?**

ఇది మన అభిప్రాయాలతో సంబంధించిన విషయం కానేకాదు. సోవియట్, అమెరికన్ శాస్త్రవేత్తలు మనతో చెప్పకుండా ఎన్నో ఉపగ్రహాలను ఏర్పాటు చేసేస్తున్నారు.

9. *ఎమ్. శ్రీనివాసరావు, తాడేపల్లిగూడెం*

**నవంబరునెల "చందమామ" వెనుక అట్టమీద సరస్వతి బొమ్మ ఎందుకు వేశారండి?**

దీపావళికి కొంచెం ముందుగా సరస్వతీపూజ (దసరా) అయినందున.

10. *దొరడ్ల బాలకోటేశ్వరరావు, అప్పికట్ల*

**అక్టోబరు సంచికలో 'మంచుమనిషి - యతి' గురించి వ్రాసితిరి. విననటువంటిది, చదువనటువంటిది మీరు వ్రాసినారు. చాలా సంతోషము. మీరు ఇంకను దీనిని గురించి, ఇతర విషయములను గురించి వ్రాయుదురని ఆశించుచున్నాము.**

తప్పక వ్రాస్తాము. కొత్తవింత ఏది వచ్చినా "చందమామ" పాఠకులకు చెప్పటానికి ప్రయత్నిస్తూనే ఉన్నాము.

11. *యస్. అబ్దుల్ మతీన్, దోనకొండ*

**సోవియెట్ శాస్త్రవేత్తలు చందమామలోనికి ప్రవేశించాలని చేస్తున్న ప్రయత్నంవల్ల మన "చందమామ"కేలాంటి ప్రమాదము లేదుకదండీ, ఎడిటర్‌గారు?**

మన "చందమామ" కు గ్రహాంతర ఖ్యాతి వస్తుంది. ప్రమాదం కొంచెంకూడా లేదు.



# వినోదాలు

వైద్యుడు: (పెద్దమనిషితో) ఈ కట్టుడు పళ్ళను మామూలు పళ్ళకన్న కూడా శుభ్రంగా ఉంచుకోవాలి.

పెద్దమనిషి: నాకు తెలీదా, డాక్టరుగారూ? అసలు పళ్లు ఊరికే వచ్చినవాయె, ఇవి బోలెడంత డబ్బుపోసి కొనుక్కున్నవాయె!

* * *

భార్య అర్ధరాత్రివేళ భర్తను లేపి, "ఏమండీ ఏదో చప్పుడయింది, దొంగాడేమో చూడండీ!" అన్నది. "దొంగాడు చప్పుడుచేస్తాడుటే! పడుకో!" అన్నాడు భర్త. మరి కాస్సేపాగి భార్య భర్తను లేపి, "ఏమీ చప్పుడుకావటంలేదు, దొంగాడేమో చూడండీ!" అన్నది.

* * *

ఒక వెర్రాసుపత్రి నుంచి ఒక రోగి తప్పించుకుపోయాడు. వాణ్ణి వెతుక్కుంటూ బయలుదేరిన వెర్రాసుపత్రి నౌకరు దారిలో కనిపించిన ఒక పెద్దమనిషితో, "మీకు వెర్రివాడెవడైనా ఎదురుపడ్డాడా?" అన్నాడు.

"ఆ వెర్రివాడు ఎలా ఉంటాడు?" అని పెద్దమనిషి అడిగాడు.

"పొట్టిగా, బక్కగా ఉంటాడు. 350 పౌనుల బరువుంటాడు!" అన్నాడు వెర్రాసుపత్రి నౌకరు.

"పొట్టిగా, బక్కగా ఉండే మనిషి 350 పౌనుల బరువు ఎలా వుంటాడు? సబబు లేని మాట!" అన్నాడు పెద్దమనిషి.

"వాడు వెర్రివాడుగద! వెర్రివాడికి సబబేమిటి?" అన్నాడు ఆసుపత్రి నౌకరు.

* * *

స్నేహితుడు: డబ్బు చేసుకోవటానికి చాలా మార్గాలున్నాయి, కాని వాటిలో న్యాయమైనమార్గం ఒక్కటే.

ధనికుడు: ఏమిటది?

స్నేహితుడు: చూశావా? నీకది తెలియదని నాకు ముందే తెలుసు!

మన జాతీయ పరిశోధనాలయాలు :

# 8. సెంట్రల్ ఫ్యూయెల్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ - ధనబాద్

మన దేశం పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి కావలసి ఉన్నది. పరిశ్రమలకు అత్యంత ప్రధానమైనవి ఇంధనాలు—బొగ్గు, నూనె వగైరాలు. అయితే మన దేశంలో మేలురకం బొగ్గు (రాక్షసి బొగ్గు) చాలా తక్కువ. లభ్యమయే బొగ్గును మేలురకం ఇంధనంగా మార్చటానికీ, కొత్తబొగ్గు నిక్షేపాలు కనిపెట్టటానికీ, ఆయా అవసరాలకు తగిన రకాల ఇంధనాలను ముడిబొగ్గునుంచి ఉత్పత్తి చేయటానికీ, ద్రవ, వాయు రూపాలలో ఇంధనాలను తయారు చేయటానికీ పరిశోధనలు అవసరం.

ఇలాటి పరిశోధనలు సాగించటానికే ధనబాద్‌వద్ద, జమ్షేడ్పూరుకు సుమారు 70 మైళ్ళ దూరంలో, ఈ సంస్థ నెలకొల్పబడింది. ఇది 1950 ఏప్రిలు 22న అధ్యక్షుడు రాజేంద్ర ప్రసాద్ చేత ప్రారంభించబడింది.

ప్రణాళికాబద్ధంగా పరిశ్రమల ఉత్పత్తి కొనసాగించటానికి ముందు ఇంధనాల సాకర్యాన్ని గురించి రూఢి అయిన వివరాలు అవసరం. ఉదాహరణకు: 2 లక్షల కిలోవాట్ల శక్తి గల బొకారో విద్యుత్కేంద్రం రోజుకు 2 వేల టన్నుల రాక్షసిబొగ్గు ఖర్చుచేస్తుంది. ఇలాగే ఇతర పరిశ్రమలూను. అందుచేత ఈ పరిశోధనా సంస్థ ఇంధనంగురించి అనేక రాష్ట్రాలకు సలహా సహాయాలను చేసి పరిశ్రమాభివృద్ధికి దోహదం చేస్తున్నది.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## డిసెంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మనిషి చూస్తే భయం

రెండవ ఫోటో : ముసుగు తీస్తే నయం

పంపినవారు : పిళ్ళా అప్పారావు,

చినరామస్వామి కోవెలవీధి, గవరపాలెం, అనకాపల్లి, (విశాఖ జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు ఆడుకుంటూ వుండగా, అక్కడికి ఒక కుర్రాడు వచ్చాడు. వాడి వెంట పెద్ద తాబేలు ఒకటి వున్నది. దాని నడుముకు ఒక గొలుసు కట్టి వున్నది. తాబేలుకు, 'టైగర్'ను కావిలిపెట్టి, ముగ్గురూ ఆడుకోసాగారు. ఇంతలో తాబేలు మెల్లిగా కాలవకేసి బయలుదేరింది. 'టైగర్' గొలుసు పట్టుకుని దాన్ని అపాలని చూసింది. కాని, సాధ్యంకాలేదు. తరవాత 'టైగర్' తాబేలుతో పాటు నీళ్ళలో పడి మునుగుతూ, తేలుతూ మొరగసాగింది. దాసూ, వాసూలూ, కొత్త కుర్రాడూ వెళ్ళి 'టైగర్'ను ఒడ్డుకు లాగితే, దాని నోట్లో గొలుసు కనిపించింది. తాబేలు పోయినా, గొలుసు దక్కినందుకు వాళ్ళు సంతోషించారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


AMRUTANJAN
Pain Balm
Amrutanjan Limited




నడుము నొప్పి
మెడపట్టుట
గుండె జలుబు
చీలమండల నొప్పి




AMRUTANJAN
Pain Balm
Amrutanjan Limited

# "సరోజ హక్కు"

"మా అన్నయ్యను వదిన సరోజ సహా సాగనంపి ఇంటికి వచ్చాం. వాడుక చీర మార్చ డానికి ధరించియున్న ఆ మెరిసే చీర విప్పబోతూ, దాని కాంతికి విస్తుపోయాను. ఆ చీర, సరోజను, ఆమె మా యింట్లో వున్నవారం రోజులూ ఇంటినెలా వుంచుకోవాలో ఇంటి పనుల నెలా సమర్థించుకోవాలో నేర్పిన ప్రాముఖ్యతను జ్ఞప్తికి తెచ్చింది. మా వదిన వెళ్లేముందు"......

*     *     *     *     *

"...... ఆ సమయంలో నారవికెకు నప్పేచీరకోసం ట్రంకంతా గాలించాను. మా అన్నయ్య నా కోసం తెచ్చిన 'పులిచారల' చీర తప్ప మరేదీ దొరకలా. ఐతే దాన్ని విసర్జిం చేశాను. తుదకు నాకు నచ్చిన బెంగుళూరంచుగల లక్క రంగు చీర చేతికందింది. కాని దాన్ని విప్పగానే నిర్ఘాంత పోయాను — మధ్యలో జానెడు చిరుగుంది. నా మంచి చీరలన్నీ మాసి పోయాయి. ఇప్పుడేది కట్టుకోవాలి? ఆ భయంకర పులి చారలదా? హాస్యాస్పదమే!" అని నిట్టూర్పు విడిచాను.



"దానిలో నాకేమీ చెరుపనిపించ లేదు విమలా! నేను ఎన్నుకున్న జతలో అదొకటి." అన్నది మా వదిన.

"నా కదంతా తెలీదు. ఇంక మీదట, నేను ధరించుకొనే వాటిని ఇతరులు ఎన్నుట వొప్పు కోను," అన్నాను.

సరోజ ఇలా పరిహసించింది: "విమలా నీకు పెళ్లయ్యాక మీ ఆయన కుతూహలంతో నీకో చీర ఎన్ని తెచ్చినా.......

"తప్పకుండా వద్దంటా; నేను ధరించాలిసింది ఎన్నుకొనే నిర్వివాదనీయమైన హక్కు నాదే."

"అది నిజమే నేను వొప్పుకున్నా. ఎన్నుకొనే హక్కు నీదే; వాటిని కాపాడుకొనే హక్కో మరి!" అన్నదామె.

"అదేమిటీ?" నా బుర్ర తిరిగిపోయింది.

ఆమె ఇలా జవాబిచ్చింది:

"ఔను, ఉదాహరణగా, నీవి అనుకొనే బట్టలకోసం నీ కిష్టమైన సబ్బును వాడి వాటిని సరియైన విధానమున ఉతుక్కొనే నీ హక్కును అమలు జరుపు కొంటున్నావా? నీకు ప్రీతైన లక్కరంగు చీర సంగతి చూడు, నీవు సరియైన సబ్బుతో సరియైన విధానమున

S/P. 6A-50 TL

ఉతుక్కొని యుంటే నీ బట్టలను కాపాడుకొని యుందువు గదా!"
"బట్టను కాపాడే సబ్బు ఏమిటి?
"మంచి సబ్బు అంటే శుద్ధమైనది. సమృద్ధియగు గుణవంతమైన నురగను గలిగించు నట్టిది—బాదకుండానే బట్టలోని మురికిని బాగుగా తొలగింప గలుగునట్టి నురగ. అటువంటి సబ్బు సన్‌లైట్, అది బట్టలను చిరిగిపోకుండా చాలా కాలము మన్నునట్లు కాపాడగలదు."
అన్నదామె.
దాంతో నాకిలా తోచింది: "నా హక్కు. నేను ధరించే బట్టలు నాకిష్టమైన రకము. నేత బద్దింపు. రంగువి ఎన్నుకొనుటలోనే గాక వాటిని కాపాడుకొనుటలోనూ వున్నది కూడాను. నేను ధరించే బట్టలకోసం ఏ సబ్బును వాడాలో నేను గాకుండా మరెవరో నిర్ణయించుట దారుణమే! నిజంగా ఇది విపరీతం!"
నేను నిర్ఘాంత పోయినుంచుంటే మా వదిన చిరునవ్వుతో ఇలా అన్నది: "చింతించకు విమలా! నీకా 'పులిచారల' నమూనా నచ్చకపోతే ఆ బీరువాలో వున్న మూటలో నుంచి నీ కిష్టమైంది ఎన్నుకో"
"ఆ బీరువా చూడగానే విస్తుపోయాను. నా మాసిన బట్టలన్నీ మెరిసే తెల్లని కాంతియైన





దొంతరగా తయారై వున్నాయి!"
సరోజ అన్నది గదా. "మాసిన బట్టలు ప్రయాణంలో దగ్గిరుంచుకోవడం నాకయిష్టం, నిన్న నా బట్టలుతుక్కొనేటప్పుడు నీవికూడా ఉతికాను!"......

*          *          *          *          *

...... ఎంతో ఋణపడ్డానే అను ఆశ్చర్యానందభావాలతో. ధరించిన ఆ మెరిసే చీర విప్పలేక నుంచున్నాను. స్టేషన్‌లోంచి రైలు కదిలినప్పుడు ఆమె ఉత్సాహంతో ఊపిన ఆ మెరిసే తెల్లని చేతిరుమాల కళ్లల్లో మెదులుతోంది. ఆకాంతి నిలవుండిపోయింది: అది బీరువాయందలి బట్టల మీద. నేను కట్టుకున్న చీర మీద. నా హృదయంలోను మిలమిల్లాడుతున్నది"
సరోజ తన వస్తువులను పెట్టుకుంటూండే బీరువా మీద ఖాళీస్థలంలో చూస్తే నలుపలకల వస్తువొకటుంది, అది సన్‌లైట్ సబ్బుబిళ్ళే నా? నిస్సంశయంగా అదే! నిజంగా అన్ని ఎక్కువ బట్టలను ఉతికే సబ్బు ఇంకేదీ వుండదనుకుంటాను. అది సమృద్ధయిన నురగను గలిగించుననియు, కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను తెల్లగాను కాంతిగాను బాదకుండానే ఉతుకునని, ఈ బిళ్ల బోధించుచున్నది." అందు చేతనే పొదుపును గలిగించుచూ బట్టలు చాలా కాలము మన్నగలవు.




S/P. 6B-50 TL

బొంబాయిలోని హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి

Photo by Brahm Dev



బహుమతి
పొందిన వ్యాఖ్య

ముసుగు తీస్తే నయం

పంపినవారు:
పిళ్లా అప్పారావు - అనకాపల్లి

